# ఎండవేడితో వంటవండేసాధనం

భారత దేశంలో దేనికి కొరతవున్నా, ఎండ వేడికిమాత్రం ఎట్టికొరవాలేదు. ఇంతకోకొల్లలుగా వున్న సహజశక్తిని నిత్యజీవితానికి వుపయోగించేలా చేసేందుకు ఢిల్లీలోని నేషనల్ ఫిజికల్ లెబరేటరీస్‌వారు పరిశోధనలు జరుపుతున్నారు.



4 అడుగుల వ్యాసంగల అద్దాన్ని వుపయోగించి 'ఫ్రీజర్ కుకర్'లో 10 నుంచీ 15 నిముషాలలో గానే కూరలువండుతూవుండటం ఈ చిత్రంలో కనుపిస్తున్నది



ఇన్‌ఫ్రారెడ్ బల్బులువుపయోగించి కృత్రిమ సూర్యుణ్ణి సృష్టించి, దాని సహాయంతో ఒక కుక్కర్‌ను పరీక్షిస్తూవుండటం ఈ చిత్రంలో కనుపిస్తుంది.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

# ఆంధ్రపత్రిక

Founder: K. NAGESWARA RAO

సంపుటము 44
సంచిక 33
23-4-52

నందన సంవత్సర చైత్ర బహుళ చతుర్దశి బుధవారము

## విషయానుక్రమణిక





వ్యాఖ్యలు, విమర్శలు:

## హైదరాబాద్ కథ [illegible]

హైదరాబాదు సంస్థాన కమ్యూనిస్టు పార్టీపై గల నిషేధాన్ని వెంటనే రద్దుచేయటానికి సంస్థాన ప్రభుత్వం నిర్ణయించింది. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, మఖ్దూం మొహియుద్దీన్ మొదలైన అగ్రకమ్యూనిస్టు నాయకులను నిర్నిబంధంగా విడుదల చేయనున్నట్లు తెలియవచ్చింది. కమ్యూనిస్టు గెరిల్లా దళాలు తమవద్దనున్న ఆయుధాలన్నిటినీ ఏ క్షణంలో ప్రభుత్వానికి వశపరిస్తే ఆ క్షణంలోనే కమ్యూనిస్టుపార్టీపై ఆంక్షను రద్దుచేయగలమని హైదరాబాదు ప్రభుత్వము, కేంద్రప్రభుత్వమూ కూడా లోగడ అనేకసార్లు ప్రకటిస్తూ వచ్చాయి. కాని ఎన్నికలకు ముందు కొంతకాలం నుండీ ఇప్పటివరకూ తెలంగాణాలో పరిస్థితి క్రమంగా మారిపోతూ వచ్చింది. నాలుగేళ్లుగా సంస్థానంలో చెలరేగిన రాజకీయ కల్లోలం ఎన్నికలు సమీపిస్తున్న సమయంలో అణగిపోయింది. కమ్యూనిస్టు పార్టీవారి రాజకీయ ఎత్తుగడలలోను, నాయకత్వంలోను వచ్చిన మార్పు ఫలితంగా సంస్థానంలో చాలవరకు ప్రశాంతపరిస్థితులు ఏర్పడినవి. తెలంగాణా ప్రాంతంలో కమ్యూనిస్టులు శాసనసభలకు అనుకోని సంఖ్యలలో ఎన్నికైనారు. అదిగాక కేంద్రప్రభుత్వం అన్ని రాష్ట్రాలలోను కమ్యూనిస్టులకు రాజకీయ రంగంలో అవకాశం ఇచ్చి చూడాలనే వైఖరి నవలంబించింది. ఈవిధంగా కమ్యూనిస్టు పార్టీపై ఆంక్ష ఎత్తివేయటానికి వీలిచ్చింది.

రెండేళ్లక్రితం సంస్థాన కారాగారాల్లో 4100 మంది డిటెన్యూలుండగా ప్రస్తుతం 160 మంది మాత్రమే ఖైదులలో ఉన్నారనీ, మిగతావారు విడుదలచేయబడ్డారనీ, ప్రస్తుత ఖైదీలలో తీవ్ర నేరారోపణలు లేనివారిని విడుదలచేసే విషయం ఆలోచిస్తామని ముఖ్యమంత్రి శ్రీబూర్గుల రామకృష్ణరావుగారు చెప్పారు. గత నాల్గేండ్లలో తెలంగాణాలో కమ్యూనిస్టులు 3800 హత్యలు, 18000 దోపిడీలు జరిపారని కూడా హైదరాబాదు ప్రభుత్వప్రతినిధి ఒకరు చెప్పారు. సంస్థానంలో ప్రజాస్వామిక ప్రభుత్వం ఏర్పడింది కనుక, ప్రశాంత పరిస్థితులు నెలకొన్నవి కనుక నేరారోపణలను నిష్పాక్షికంగా విచారించటానికి ఎటువంటి అభ్యంతరమూ ఉండదు. కమ్యూనిస్టు పార్టీపై ఆంక్ష రద్దుచేసి హైదరాబాదు ప్రభుత్వం ప్రజాస్వామిక విధానంలో తనకు గల విశ్వాసాన్ని నిరూపించుకోవటం హర్షించదగిన విషయం.

### పెప్సూలో పరిస్థితి తారుమారు

తూర్పుపంజాబ్, పాటియాలా సంస్థానాల సమాఖ్యలో నెలరోజులక్రితం ఏర్పడిన కాంగ్రెసుమంత్రివర్గం ఈనెల 18 వ తేదీన రాజీనామా యిచ్చింది. యునైటెడ్ ఫ్రంట్ పార్టీ నాయకుడైన సర్దార్ జ్ఞానసింగ్ రార్వాలాను మంత్రివర్గం ఏర్పరచవలసిందిగా రాజ్ ప్రముఖ్ కోరారు. గత ఎన్నికలలో పెప్సూ శాసనసభకు 26 మంది కాంగ్రెసు సభ్యులు, 33 మంది స్వతంత్రులు, ఇతరపార్టీలవారు, ముగ్గురు కమ్యూనిస్టులు ఎన్నికైనారు. తరువాత కాంగ్రెసు పార్టీలో కొందరు ఇతరులువచ్చి చేరారు. తత్ఫలితంగా కాంగ్రెసు అధికసంఖ్యాకవర్గం కావటం, మంత్రివర్గం ఏర్పరచటం జరిగింది. ఇటీవల తిరిగి కాంగ్రెసులోనుండి నలుగురు రాజీనామాయివ్వటంవల్ల కాంగ్రెసు మైనారిటీ పార్టీగా మారిపోయి రాజీనామా యివ్వవలసిన పరిస్థితి ఏర్పడింది. స్పీకరు ఎన్నిక సమయంలోనే కాంగ్రెసు అభ్యర్థి ఓడి



రాయలసీమలో భారత సర్వసేనాని పర్యటన : క్షామపరిస్థితులను గురించి స్థానిక ప్రజలతో సర్వసేనాని చర్చిస్తున్న దృశ్యం.



ఎండిపోయిన బావిని సర్వసేనాని తనిఖీ చేస్తున్నారు

పోయి యునైటెడ్ ఫ్రంట్ అభ్యర్థి డాదరి కరూన్‌సింగ్ ఎన్నిక కావటం జరిగింది. అయినా రాజ్యాంగరీత్యా కాంగ్రెసుమంత్రివర్గానికి ఓటమి సంభవించలేదు. ఇప్పుడు కాంగ్రెసు శాసన సభ్యులసంఖ్య సగంకంటె తగ్గిపోవటం మూలంగా మంత్రివర్గం రాజీనామా ఇవ్వక తప్పలేదు. యునైటెడ్ ఫ్రంట్ పార్టీ నిజానికి ఒక ప్రత్యేకపార్టీ కాదు. శాసన సభా వసరాలకోసం వివిధ పార్టీలుకలిసి ఏర్పరచుకొన్న పార్టీ. అయినా వారి సంఖ్య సగానికి అధికంగా ఉండటంవల్ల వారి నాయకుని మంత్రివర్గం ఏర్పరచమని కోరటం జరిగింది. ప్రతిపక్షంలోని సభ్యులు కొందరు తనకు పదవు లిప్పిస్తే కాంగ్రెసును బలపరచగలమని తనతో చెప్పినట్లు, తాను నిరాకరించినట్లు కర్నల్ రఘువీర్ సింగ్ ఆరోపించారు. పెప్సూ రాజకీయాల్లో కలిగిన తారుమారు పరిస్థితి కేవలం పదవుల కుమ్ములాట ఫలితమే. అయితే యునైటెడ్ ఫ్రంట్ ఏర్పరచబోయే మంత్రివర్గంకూడా ఎక్కువకాలం నిలవలేదని నిర్ధారణగా చెప్పవచ్చు. ★

# ఆంధ్రచిత్రకారులకు అమెరికాబహుమతులు



శాన్ ఫ్రాన్సిస్కోలో (అమెరికా) జరుగబోయే భారతీయ కళల మహోత్సవాలకు పోస్టర్లువ్రాసి ద్వితీయబహుమానంపొందిన కె. శ్రీనివాసులుగారు (అడయారు)

సాన్‌ఫ్రాన్సిస్కోలోని అమెరికన్ ఎకాడమీ ఆఫ్ ఏషియన్ స్టడీస్ సంస్థవారు భారతీయ కళల మహోత్సవం ఒకటి ఏర్పాటుచేస్తున్నారు. అందుకు సంబంధించిన కొన్ని పోస్టర్లు తయారు చేయించారు. భారతదేశం నలుమూలల నుంచి వెళ్లిన పోస్టర్ నమూనాలలో మద్రాసు (అడయారు) నుంచి కె. శ్రీనివాసులు, జి. వి. సుబ్బారావు గార్లు పంపిన వాటికి వరుసగా ద్వితీయ, తృతీయ బహుమానాలు వచ్చాయి.

కె. శ్రీనివాసులు గారు మద్రాసు స్కూలు ఆఫ్ ఆర్ట్సులో చిత్రకళాభ్యాసంచేసి ఫస్టు క్లాసులో ప్యాసై, బంగారు పతకాన్ని కూడా పొందారు. స్కూలు నుంచి బయటకువచ్చి నప్పటినుంచి యీయన జానపద చిత్రకళాశైలిని అలవర్చుకోవటానికి ప్రయత్నించి, ఆ ప్రయత్నంలో చాలామటుకు విజయం పొందారు. కొండపల్లి బొమ్మలలోనూ, కాళీకావిడి పటాల లోనూ కనుపించే మనుష్యాకృతులను, వాటిని రచించే పద్ధతిని అభిమానించి యీయన ఆ పద్ధతులలో వందలకొద్ది చిత్రాలు వ్రాశారు. కళారంగంలో కొత్తగా వచ్చిన ప్రాబల్యాలమూలంగా వీరు పట్టిన పద్ధతికి ఆదరణ చేకూరుతున్నందుకు సంతోషించవలసిందే. ఇటీవల అడివి బాపిరాజుగారు సింహళద్వీపంలోని సిగిరియా కుడ్య చిత్రాల మచ్చులు తయారుచేయ బోయినప్పుడు వారివెంట ఈ శ్రీనివాసులు గారు కూడా వెళ్ళి వచ్చారు. ఈయన చాలాకాలంగా అడయారు బిసెంట్ థియొసాఫికల్ స్కూలులో చిత్రకళాబోధన శాఖాధిపతి.

జి. వి. సుబ్బారావుగారు శాంతినికేతనం పట్టభద్రుడు. పట్టంపుచ్చుకొన్నాక అక్కడే మరికొంతకాలంవుండి చిత్రకళాభ్యాసం కూడాచేసి, అందులోనూ ఒక యోగ్యతాపత్రం సంపాదించారు. ఈయన కూడా అడయారులో వున్న కళాక్షేత్ర సంస్థలో చిత్రకళాధ్యాపకుడుగా పనిచేస్తున్నారు.

పోస్టర్లు పంపేవారు నాలుగే రంగులు వాడాలనీ, ఒక్కొక్క పోస్టరు 16 × 21 అంగుళాల ప్రమాణంలో వుండాలనీ ఆ సంస్థవారు నిర్దేశించారు. ఆ ప్రకారమే మూడు నమూనాలు వ్రాసిపంపిన శ్రీనివాసులుగారికి వాటిలో ఒకదానికి రెండవ బహుమానం, ఒక్కటే పంపిన సుబ్బారావుగారికి మూడవబహుమానం వచ్చాయి.

అమెరికాలోని ఏషియన్ స్టడీస్ సంస్థవారు సాన్‌ఫ్రాన్సిస్కోలో గత ఫిబ్రవరిలోనే యీ భారతీయ కళల వుత్సవం జరుపాలనుకొన్నారు. ఇంకా ఎక్కువమంది పాల్గొనే అవకాశం యిచ్చేందుకుగాను వుత్సవాలను నవంబరుకు వాయిదా వేశారు. ఈ వుత్సవాల సందర్భంలో భారతీయ నృత్య, గాన, కళలలో ప్రఖ్యాతి వ్యక్తులైనవారు అక్కడచేరి తమ తమ నైపుణ్యాలను ప్రదర్శిస్తారు. భారతీయ చిత్రకళలో నాడు నేడు ఏర్పడిన మార్పులనుగూర్చి విమర్శకులు వుపన్యాసాలు యిస్తారు. ఉపన్యాసాలలో వుదాహరణ పూర్వకంగా బొమ్మలు చూపించుతారు. ★



తృతీయ బహుమానం పొందిన జి. వి. సుబ్బారావుగారు. (అడయారు




(ఉరుముల ధ్వనితో గాలివాన ప్రారంభమై క్రమంగా హెచ్చిపోతుంది. మధ్య మధ్య *Crowd effect.* రెండు నిముషాల తరవాత గాలివాన జోరు తగ్గి దూర దూరాలనుంచి మాటలు స్పష్టంగా వినపడుతవి.)

విశ్వనాథంగారు : అబ్బబ్బబ్బ — ఏం వాన, ఏం వాన ఇంత నాణ్యమైన పాత గొడుగు కూడ యీ వానలో ఉపయోగపడేట్టు లేదు. ఝుయ్యిమని ఉండుండి గాలి కొట్టంగానే నాలుగేపుల్నుంచి జల్లు కొట్టి చొక్కా ధోవతీ తడిసిపోతున్నయి. కొంప చేరాలంటె ఇంక దాదాపు అర మైలు నడవాలి. (వెనకనుండి "విశ్వనాథం గారూ" అని పిలుపు) ఎవరది? పరమా పుళ్లా పిలుస్తున్నాడు! వానలో గొడుగు చేత బట్టి నడచేవాడు ప్రతివాడికి ఆప్తబంధు వే! (మళ్లీ పిలుపు వినపడుతుంది.) ఆ ఆ అదుగో ఇటే వస్తున్నాడు ఈన నెక్కడ్నో చూచిన మొహమే. కాని పేరేమిటో తెలీదే! బహుశ గొడుగు చూసే వెంబడి పడ్డాడు

సీనయ్య : నమస్కారమండీ విశ్వనాథం గారూ. పాపం గొడుగు ఉండికూడా వానలో తడుస్తున్నారు. (ఇద్దరు నీళ్లల్లో నడుస్తున్న ధ్వని)

విశ్వ : ఈలా ఝుయ్యిమని గాలి కొడుతుంటె గొడుగు ఏం అగుతుందండి...... అయితే...మరి లోపలికి రాండి మరీ తడుస్తున్నారు. (వాన నిలిచి కొడుతున్న శబ్దం)

సీనయ్య : నడవండీ, లోపలికొస్తేమాత్రం ఒక్క గొడుగు బ్రహ్మాండమైన యీ వానలో ఇద్దరికీ ఏం సహాయపడుతుంది? అయినా తడిసిన వాణ్ణి ఎట్లాగో తడిశాను ముక్క మొలిచిపోతానా యేం.

విశ్వ : అట్లా అంటారేం లోపలికిరాండి ఫరవాలేదు. ఏదో వానలో గొడుగు వేసుకు వెళ్తుంటే పిలిచినప్పుడు ఆ మాత్రం సహాయం చెయ్యలేకపోతాం.

సీన : సరే మిమ్మల్ని గొడుగు కోసం పిల్చానను కున్నారు కాబోలు. అబ్బే! అట్లాగైతే ఆ దుకాణంవాడు నాకు బాగ పరిచయం. గొడుగు యిస్తాను పంతులుగారు పట్టుకెళ్లి వాపసు చెయ్యండి అన్నాడు. ఈ వానలో వాడి గొడుగు నేను పట్టుకెళ్తే వాడు ఇబ్బందిపడతాడని నేనే వద్దులేవోయ్ అన్నాను. ఇంతకూ మా యింటి మీదుగానే గదా మీరూ వెళ్లేది తోటు తోడుగా పోవచ్చునని పిలిచాను.

విశ్వ : ఓహో అలాగా

సీన : అవునుగాని తమ గొడుగు చాల పెద్దదండీ!

విశ్వ : (గర్వంగా) ఈ గొడుగుందే చూశారూ

సీన : అయ్యా

విశ్వ : మా తాతగారు వారి హయాంలో రెండున్నరకి కొన్నారు. మా నాన్నగారు భద్రంగా వాడి నాదాకా దాచారండీ! ఈ నాటికూడా చెక్కు చెదర్లేదు. కాస్తంత ఈ బట్ట ఆ నాలుగు కెత్తలు మాత్రం ఊడిసయ్యి. ఈ మధ్య నేనండి ఆ నాలుగు చిల్లులు పడింది అయినప్పటికీ ఈ మధ్యన వచ్చే వెధవ సరుకు దీనిముందు బలాదూరంటే నమ్మండి.

సీన : అసలు ఆ కాలపు సరుకు నిజాయితీ ఏ అంత పైగా మన పెద్దవాళ్లు అస్తారపదంగా దాచి వాడుకొనేవాళ్లు. ఇంతెందుకు మూడు నెలలయింది. పన్నెండు రూపాయలచొప్పున రెండు గొడుగులు కొన్నాను. ఇట్టె నాలుగు రోజులు వాడానోలేదో కెత్తం ఇరగటం, కడ్డీలు వంగిపోవటం, బట్ట చినగటం ఇదీ వరస! ఎందుకూ పనికిరాక మూలపడేశానంటె నమ్మండి మీ గొడుగుకట్టుమాడండి ఎంత ధృఢంగా యీ నాటికీ చెక్కు చెదరకుండా ఉందో!

విశ్వ : చూశారా

సీన : అయ్యా

విశ్వ : అసలు దీనికీ ఈ నాటివాటికీ పోలికెక్కడిదండీ? నా చిన్నతనంలో బాగా జ్ఞాపకం, ఇంట్లో పందిరి మంచంపై కట్టు విరిగితే వడ్రంగిని పిలిపించి మా నాన్నగారు ఈ గొడుగు కట్టుగా తయారు చేయించారు.

సీన : అలా చెప్పండి

విశ్వ : చూశారూ!

సీన : అయ్యా... ఆ అన్నట్టు నేను పొడగర్ని కావటం మూలాన మీరు గొడుగుని చాల ఎత్తిపట్టుకోవాల్సి వస్తున్నది. చెయ్యి నెప్పి పుడుతుందేమో... నేను పట్టుకుంటాను ఇటు తేండి.

విశ్వ : అబ్బె ఫరవాలేదు.

సీన : ఆహాఁ మీ చెయ్యి నెప్పి పుడుతుంది. ఇటు యియ్యండి.

విశ్వ : వెధవజల్లు గొడుగు మార్చేలోగానే బుజంమీద చొక్కా అంతా తడిసింది. అన్నట్టు కాస్త ఈ వైపు పడతారా గొడుగు.

సీన : అయ్యో అంతకంటేనా!

విశ్వ : తమ యిల్లు దాగ్లోనే అన్నారు కదూ?

సీన : ఆ అదేం ఆ బజారు మలుపు దాటితే ఆ వచ్చే సందులో ఉన్న ఎడం వైపు కొందిలో చిట్టచివరియిల్లే. ఆ సందు కుండానే మీరు రోజూ ఇంటికి పోయేది.

విశ్వ : అవునవును.

సీన : అయ్యా—చూశారు, అసలు నా జీవితంలో చాలమందిని చూశాను. కాస్తంత తీవ్రంగా ఎండ కొడుతున్నా లేక మేఘం వేసి తుప్పర ప్రారంభమైనా గొడుగు చేతిలో ఉంటే సరి ప్రపంచమే కనిపించదు. ఎవరు పలకరించినా వినపడనట్లు నటిస్తారు. పొయ్యేనాడు ఏంకట్టుకుపోతారండీ వీళ్లంతా.

విశ్వ : చూశారూ

సీన : అయ్యా

విశ్వ : కాస్త మర్యాదా మన్ననా ఎరిగిన పెద్దమనిషైతే అలా చెస్తాడా?

సీన : అవునా. ఇట్టే కేకయ్యంగానే మీరు కాబట్టి నిలిచిపోయారు. అయినా నేనసలు గొడుగుకోసం అంటూ పిలవనూ లేదు.

విశ్వ : అబ్బె పిలిస్తే మాత్రం తప్పేముంది......ఆ కాస్తంత, కొద్దిగా, గొడుగు ఈ వైపు పడతారు వెధవజల్లు మరీ తడుస్తున్నా.

సీన : అయ్యో అవశ్యం. అసలు తమరు పూర్తిగా గొడుగులో నడవండి విశ్వనాథం గారూ. మరీ తడిసిపోతున్నట్టుంది...ఏదో పెద్దల్ని సేవించటం దైవికంగా కలిగింది.

విశ్వ : ఏం అలా కలవిచ్చారు.



సీన : నేను పొడగర్నికావటంవల్ల నేగా మకి ఈ మాత్రం గొడుగు పట్టగలిగాను!

విశ్వ: కొంపతీసి యిది సేవగా మాత్రం ంటగట్టబోకండి మహానుభావా. అనవస ంగా మీకు ఋణాన పడిపోతాను.

(ఇద్దరూ నవ్వు)

సీన : అదిగో ఆ కనపడేదే మాయిల్లు... మీకు చాల శ్రమయిస్తున్నాను క్షమిం చాలి. మీరు మా యిల్లు యిదివరకు చూడ లేదుగా, దయ చెయ్యండి.

విశ్వ : సరే పాండి...

(సీనయ్యగారింట్లో సీనయ్య భార్య సీతాయమ్మ పిల్లవాడిమీద అరుస్తుంటుంది)

సీతా : ఎట్లా చచ్చేదిరా, తడిస్తే తడి కావు తువ్వాల నెత్తి నేసుకు వెళ్లరాబాబూ అంటే అపుకూచున్నావేం రా?... అరుగో నాన్నారు ఎవరిదో గొడుగు పట్టు కొచ్చారే... ఏమండోయ్ మిమ్మల్నే.

సీన: విశ్వనాథంగారూ ఈపంచలో కాస్త విశ్రాంతి తీసుకోండి. ఇప్పుడే వెళ్దాం

విశ్వ : (ఆశ్చర్యంగా) మళ్లీ మీరూ వస్తున్నారా?

(సీనయ్య వినిపించుకోకుండా లోపలి కెళ్తాడు. లోపల భార్యాభర్తల సంభాషణ బైటికి వినపడుతూనే వుంటుంది)

సీతా : కాస్త గొడుగు ఇటివ్వండి. ఈ పట్టుకుంక వానకి ఝుడిసి కడుపుబ్బినా అపుకూర్చున్నాడు. దొడ్లో ఆరగట్టిన చీరకూడా విప్పుకురావాలి.

సీన : అయ్యొ అయ్యొ! అట్లా లాక్కెళ్తా వేమే! ఇది మన గొడుగు కాదు. ఆ పెద్ద మనిషి వాకిట్లో కూచున్నాడు.

సీతా : ఎవరిదైతే నేం. కాయిక్కు లింటామా మరీసొద్దెం. ఆయన మాత్రం ఏమంటాడు. అవతల పట్టాడు కడుపుబ్బి ఏడుస్తొంటే.

(బైట విశ్వనాథంగారు)

విశ్వ : బాగానే వుంది ఖర్మ. జారిన పోయేవాణ్ణి పట్టుకోని యింటిదాకా గొడుగులో వచ్చింది చాలకనా. పిల్లాడి అక్కాఱకీ, పెళ్లాం ఆరగట్టిన చీర విప్పుకు రావటానికీ నా గొడుగే! నా గొడుగు వీళ్లిలా మర్యాదలేకుండా వాడుకుంటుంటే వాకిట్లో గుడ్లప్పచెప్పి గుటకలు మింగుతూ కూచోనేది. ఛీఛీ-వీళ్లకి కాస్త బుద్ధంటూ వుండాలిగాని ఏవని అడగను. నా మెతక తనం మొహమాటం చూసి మరీ యింత చొరవా?...ఇంతకూ బైటికి రాడేం ఎంత సేపటికీని......ఏమండోయ్ ఏమండోయ్ నా గొడుగు యిప్పించండి త్వరగా వెళ్లాలి.

సీన : (లోపల్నుంచి) ఏమే గొడుగీలా తే-ఆ ఆ వస్తున్నానండోయ్ విశ్వనాథం గారూ! తమకు చాల శ్రమ యిచ్చాను క్షమించాలి.

విశ్వ : అబ్బె దానికేంలెండి. ఫరవా లేదు. గొడుగివ్వండి వెళ్లొస్తా.

సీన : నేను మీతొ బాటు అందాకా వచ్చి అటునుంచి దుకాణానికి వెళ్తాలెండి. వెధవ చినుకులు ఇంకా తగ్గనే లేదు.

విశ్వ : స-రే-మరి నడవండి త్వరత్వరగా గొడుగు నేను పట్టుకుంటా ఇటివ్వండి.

సీన : అబ్బె! ఎందుకు నేనుండగా, గబ గబా నడవండి (బస్సు వచ్చి ఆగిన శబ్దం) విశ్వనాథంగారూ నేవెళ్లుతున్నాను. బస్సు టైముకే వచ్చింది. సరిగ్గా దుకాణం ముందుగా వెళ్తుంది. కదుల్తున్నది ఎక్కేస్తు న్నాను.

విశ్వ : అయ్యొ అయ్యొ గొడుగు గొడుగు

(బస్సు కదలిపోతుంది.)

సీన : అరెరెరె, బస్సు కదిలింది. పొర పాటున గొడుగుతోనే ఎక్కేశాను!

విశ్వ : (ఆదుర్దాగా) విసిరెయ్యండి, విసిరెయ్యండి పట్టుకుంటాను.

సీన : విసిరేస్తే విరిగి పోతుంది. రేపు తెస్తాలే బస్సెంబడి పరిగెత్తకండి ప్రమాదం ప్రమాదం (బస్సు దూర దూరాల పోయిన ధ్వని)

విశ్వ : ఆరి పిడుగా, మొహమాటానికి పోతే గొడుక్కాస్తాపోయింది. ఛీఛీ గట్టిగా అనలేనుగదా అని ఎంత పని చేశాడు... చినుకులింకా పడుతున్నై. కండువా నెత్తి నేసుకోనన్నా నడుస్తాను, రేపు తెచ్చిస్తా నన్నాడుగా! ★

(ఆల్ ఇండియా రేడియో హైదరాబాద్ సౌజన్యంతో-)



# ★ ఆలీపూర్ మింట్ ★



అలీపూర్ మింట్ లో సత్తునాణేల తయారీకిగాను మూసలో కరిగిపడుతున్న లోహాల.

నాణా కాసులూ పావలా కాసులూ
ఇట్టిట్టే తెలియకుండా పెళ్ళసం
...నించీ, జేబుల్లోనించీ జారిపోతా
...న్నా కాని వీటిని తయారుచెయ్య
...ంకి పెద్ద తతంగం ఉంది ఇప్పుడు మనకి
...వలసినన్ని, ద్రవ్య నాణాలు తయారు
...య్యడానికి బొంబాయి, హైదరా
...లలో మింట్లు (టంకసాలలు)
...పడం లేదు అందువల్ల భారత ప్రభుత్వం
...త్త యంత్రపరికరాలతో అలీపూ
...ర్ (కలకత్తా దక్షిణభాగంలో ఒక
...) 87 ఎకరాల నేలలో రెండుకోట్ల
...లక్షల రూపాయల ఖర్చుతో కొత్త
...సాల ఒకటి స్థాపించారు ఈ మింట్ లో
...పాయి మొదలు కానీవరకూ రోజుకి
...ండులక్షల నాణేలు తయారు చెయ్య
...ట అంటే మొత్తం అన్ని మింట్ల
...కూ కలిపి అవసరానికంటె ఎక్కువే
...రు కాగల తాహతు ఇప్పుడుందన్న
... ఆస్ట్రేలియా, సింహళం, ఈజిప్టు,
... అరేబియా, మొదలైన దేశాలు ఇప్పు
తమకు కావలసిన కొన్ని నాణేలను మన
...లో తయారు చేయించుకుంటు
...యి ఇప్పుడింక విరివిగా ఇతర దేశాల
...ం నాణేల తయారీకి పెద్ద కంట్రాక్టులే
...కోడానికి వీలుంటుంది
...న్ని మింట్లు చాలకపోవడంవల్ల
...లో అలీపూర్ లో ఇదే స్థలంలో

మింట్ కట్టాలని అప్పటి భారత ప్రభుత్వం ప్రయత్నం చేసింది యుద్ధ కాలం కాబట్టి కలకత్తా నగరంలో ఉంటే ముప్పు వస్తుందని భయపడి సిద్ధపరిచిన యంత్రపరికరాల్ని లాహోర్ సమీపంలో భగవాన్ పురం వద్దకు తరలించారు అక్కడ నిర్మించిన మింట్ కాస్తా దేశ విభజన అనంతరం పాకిస్తాన్ పరమై పోయింది తిరిగి అన్ని ఏర్పాట్లు చేసుకొని కొత్త యంత్రపరికరాలు కొని అలీపూర్ లో 1947 లో మింట్ ఫాక్టరీల నిర్మాణం ప్రారంభించారు నిర్మాణం కేంద్రప్రభుత్వపు పబ్లిక్ వర్క్స్ శాఖ అజమాయిషీలో నడిచింది మొదట కలకత్తా మింట్ మాస్టర్ మేజర్ బింగ్లీ, తరువాత మేజర్ జె హెచ్ పార్ట్రిడ్జ్ గార్లు మింట్ నిర్మాణానికి ఆధ్వర్యం వహించారు

ఈ మింట్ తో పాటు పరిశోధనశాఖ, పరిశీలకశాఖ (ఎస్సే)కూడా నెలకొల్పబడినాయి నాణేల లోహ పరిమాణాలు సరిగా ఉన్నాయో లేదో, లోహం సరైనదానో



నాణేలు తయారుచేసే నవీన యంత్రం.



సైనికులకు తదితరులకు యిచ్చే బహుమాన పతకాలు తయారు అవుతున్నాయి.

కానో పరిశీలక శాఖలో పరిశీలించబడుతుంది. నాణేల తయారీలో మిశ్రమ లోహాలను అతిజాగ్రత్తగా పరిశీలించవలసిన అవసరం ఉంటుంది. ఇంతేకాకుండా బాంకులూ, బులియన్ వ్యాపారులు కోరినట్లయితే లోహాల నిక్కడి పరిశీలించడానికి ఏర్పాట్లు చెయ్యబడ్డాయి. పరిశోధన శాఖలో నాణేలకు, పతకాలకు (మెడల్స్) అవసరమైన లోహాలనుగురించీ, నాణేల నిర్మాణానికి సంబంధించిన ఇతర విషయాలను గురించీ పరిశోధన జరుగుతుంది. ఈ ఉన్నత శాఖల్లోనూ అధునికమైన యంత్ర పరికరాలు నెలకొల్పబడ్డాయి.

నాణేల నిర్మాణవిధానంలో ఇటీవల కాలంలో చాల మార్పులు వచ్చాయి. నాణేలలో వెండి మొదలైన ప్రశస్త లోహాలు తగ్గిపోతున్న వన్న మాట అందరికీ తెలిసిందే. నికెల్ వచ్చి ఇతర లోహాలన్నిటినీ తోసేస్తోంది. నకిలీనాణేలు చెయ్యడానికి సాధ్యపడని రీతిగా తమ నాణేలను తయారుచెయ్యడం ప్రభుత్వానికి ముఖ్య సమస్య. ఇందుకు నికెల్ చక్కగా తోడ్పడుతున్న దంటున్నారు. కాని మన దేశంలో విశ్వబ్రాహ్మణులలో అఖండ ప్రజ్ఞావంతు లున్నారు. శిల్పంలో వారికి జగత్తులో మరొకరు సాటిలేరని ఒప్పుకోకతప్పదు. అందువల్ల మరేదో అతీతమైన మర్మం కనిపెడితే కాని మన శిల్పుల్ని ప్రభుత్వం జయించడం అనుమానమే.

అలీపూర్ మింట్ పని పూర్తిగా మొదలుపెట్టగానే స్ట్రాండ్ రోడ్డులో 127 సంవత్సరాలనించీ పనిచేస్తున్న పాత మింట్ మూసివెయ్యబడుతోంది. మన దేశంలో ఉన్నవాటిలోకెల్ల ఇది అతి పురాతనమైనది. అంటే బ్రిటిష్ వారి నాణేల్ని ముద్రించి ముద్రించి అపాతమింట్ ఇంక చిరవిశ్రాంతి తీసుకుంటుందన్నమాట. కొత్త శోభతో కొత్త మింట్ కొత్త వ్యవస్థకోసం కృషిచేస్తుంది ★

30-4-52 బుధవారం నుండి మా సచిత్ర వారపత్రికలో "విజ్ఞాన వీధులు" అనే శీర్షిక క్రింద ప్రశ్నలు సమాధానాల రూపంలో వివిధ విజ్ఞాన విశేషాలు వరుసగా ప్రకటింపబడతాయి.



అలిపూర్ మింట్ లో తయారైన నాణేలు, పతకాలు.



"నువ్వు కమ్యూనిస్టువట" అన్నాడు సుబ్బారావు కంపెనీ నుండి సాయంకాలం ఇంటికివచ్చేటప్పుడు

"ఎవరన్నారు?" అనడిగాడు సత్యం తనని కాదన్నట్టుగా.

"అందరూ అంటున్నారు. అధికారుల దృష్టి నీ మీద పడింది. ఎందుకైనామంచిది జాగ్రత్తగా మసలుకో"

సత్యం వెర్రిగా, చిన్నగా నవ్వాడు. సుబ్బారావు ఈ మాటలని ప్రక్కసందులు మలుపు తిరిగాడు. సత్యం నడుస్తూనే "నేను కమ్యూనిస్టును" అని రెండు మూడు సార్లు అన్నాడు. అలా గొంతుక న్నాడో, ఏమాలోచిస్తున్నాడో తనకే తెలియడం లేదు. ఇంటిగడప తొక్కగానే "మధ్యాన్నం అన్నానికి రాలేదేం?" అంది అమ్మ. "రాలేదూ?" అని తిరిగి ప్రశ్నించి మంచం మీద కూలబడ్డాడు. కొంతసేపటికి

అమ్మ మూలుగుతూ "అన్నానికి రా, పొద్దోయింది" అంది. అమ్మమూలుగుతుంది. టానిక్కులు కొనడానికి డబ్బులేదు. ఏదో ఆలోచిస్తూనే రెండు మెతుకులు కొరికి వరండాలోని మంచం మీద నడుం వాల్చాడు.

అంతే. అప్పటినుండి ఇంక ఏవేవో ఆలోచనలు ప్రారంభిస్తాడు. సత్యానికి అన్నీ సమస్యలే. అవి ప్రతిరోజూ పెరుగు తుంటయ్. అలాగే ఇవాళ కూడ పెరిగింది ఒకటి. తను కమ్యూనిస్టట. అందరూ అను కుంటున్నారు. అందరూ అలాగే అనుకుం టారు, ఏదో ఒకటి అనుకోకుండా ఉండ లేరు. అని సత్యం ఊరుకోడు. ప్రజలందరూ అన్నది నిజమనే నమ్మాడు. అందరి నోటంట వచ్చిన మాటలు తప్పకుండా నిజమై తీరుతయ్యనే ఎన్నో గాలిమేడలు కట్టాడు. ఎప్పటికైనా, ఎవరైనా వచ్చి తీర్చి దిద్దుతుందని సత్యం ఏకోశానా తలచ లేదు. తను బీదవాడిననీ, బీదవాడిగానే జీవితం గడపాల్సి వస్తుందనీ ముందే అను కుంటే సత్యం ఈ నాడు ఇంత హీనస్థితిలో ఉండక పోయేవాడు. ఇన్ని సమస్యలూ ఉండవు.

"సత్యం చాల బాగా చదువుతాడు. మంచి అభివృద్ధిలోకి వస్తాడు" ఎక్కడ చూచినా ఇవే మాటలు వినేవాడు. ఆ మాటలే సత్యాన్ని బాగా కాత్తుకున్నయ్. కాని ఈ మాటలు ఎంత బాగా కాత్తుకున్నా, ఎన్ని ఊహాసౌధాలు నిర్మించు కున్నా, ఆ శ్రీపతితో స్నేహం చేయక పోయినట్లయితే సత్యం ఈనాడు ఇన్ని సమస్యలతో కృంగి కృశించి పోయేవాడు కాదేమో! శ్రీపతి అంటే లక్షాధికారి కొడుకనీ, అతనికి చదువుతో నిమిత్తంలే దనీ, అతని డబ్బే అతన్ని ఒకపూట బాట వెంబడి స్వర్గలోకాల్లోకి తీసుకుపోతుందని తెలిసిఉంటే శ్రీపతితో మేడమీద ఎల క్ట్రిక్ లైటులో చదవడానికి అంతగా ఉత్సాహపడేవాడు కాడు. అంత గర్వ పడేవాడు కాడు. స్కూలుఫైనలుతోనే చదువు పూర్తిచేసి సుబ్బారావులా నెలకి నూటయాభయ్ సంపాదిస్తూ సుఖంగా కాలం గడిపేవాడు.

ఇప్పుడు గతంనాస్తి అని పూర్వపు సంగతులు మర్చిపోతా మనుకుంటాడు. కాని మరువలేడు. ప్రతిరోజూ తన జీవి తపు పుటలు తిరగేస్తాడు. శ్రీపతితో తను గడిపిన చిన్నప్పటి జీవితమూ, తను ఊహిం చిన ఊహాలూ జ్ఞాపకం వస్తుంటయ్. అప్పుడూ ఇప్పుడూ కూడ శ్రీపతికీ, సత్యానికీ తేడాఉంది. కాని అప్పటి తేడా వేరు, ఇప్పటి తేడా వేరు. అందుకే ఇవన్నీ తలచుకున్నప్పుడు శ్రీపతిమీద ఈర్ష్యపుడుతుంది.

స్కూలులోని శ్రీపతి జీవితాన్ని చూచి అప్పుడు ఎంత గర్వపడేవాడో ఇప్పుడంత సిగ్గుపడుతున్నాడు. శ్రీపతి తండ్రి జేబు నుండి నోట్లు దొంగలించుకొచ్చి దర్జాగా ఖర్చుపెడుతుంటే లోకమంతా వాడు మంచి రౌడీ అవుతాడనీ, చివరకు చిప్ప పుచ్చుకొని తిరుగుతాడని కోడై కూసింది. అందరూ అన్నట్టు శ్రీపతి రౌడీకానూ లేదు, చిప్ప పుచ్చుకుని తిరగడం లేదు, సత్యం అభివృద్ధిలోకి రానూ లేదు.

శ్రీపతి ప్రతి క్లాసులోనూ కనీసం ఒక గంటయినా బెంచీమీద నిలబడేవాడు. అది అతని కలవాటే. అసలు బడికిరావడం బెంచీమీద నిలబడ్డానికే అని అతని ఉద్దేశం. వాడలా నిలబడ్డప్పుడు ప్రక్కను కూర్చుని తను బాగా చదువుతాను అని గర్వించేవాడే కాని, వాడు ప్రతి సంవ త్సరం ప్రయివేట్లు పెట్టి, లంచాలిచ్చి ప్యాసవుతుంటే, అప్పుడుకూడ డబ్బుకున్న ప్రాముఖ్యత, విలువ సత్యానికి తెలియలేదు.

తను స్కూలు ఫైనలు ప్యాసయిననాడు

(19–వ పేజీ చూడండి)




# దెయ్యం

రచన:

**శ్రీ యర్రా మురళీకృష్ణమోహన్**

నారాయణకు కోరికలు లేకపోలేదు. జీవితంలో ఎక్కువ తృప్తినిచ్చే దాంపత్యసుఖానుభూతికి దూరంగా వుండాలని యేనాడూ కలలోనైనా వూహించడు. కానీ, దారిద్ర్యానికి కట్టుబడ్డ నారాయణ కొంత అయిష్టం చూపించేడు. యౌవనంలో అడుగుపెట్టిన నారాయణ, హృదయంలోని తీరనికోరికలరూపాలకు తట్టుకోలేక 'పెళ్ళివద్దు' అని కచ్చితంగా చెప్పలేకపోయాడు.

వద్దంటే మాత్రం, విధి వదిలిపెడుతుందా! వద్దన్నా వినిపించుకోకుండా అయిందనిపించేడు ముసలాడు నారాయణ పెళ్ళి. నారాయణకు తెలుసు నేటి ప్రపంచంలో తన విలువ నలభై రూపాయలు సంపాదించేటప్పటికి తల ప్రాణం తోక్కి వస్తుంది దాంతోటి, మూడు ప్రాణులు బతకాలాయె ఈ కరువురోజుల్లో. మొదట తారీఖు వారం వుండనగానే మొదట అప్పులు. జీతం వచ్చేక అవి తీర్చేస్తే బండి నడవదు అందుచేత అవి పాపం పెరిగినట్లు పెరుగుతూనే వుంటాయి. ఇది అతని ఆర్థిక పరిస్థితి ఇక పెళ్ళాడి యేం సుఖా లనుభవించాలి కనుక. పెళ్ళాడగానే సరిపోయిందా, పిల్లాపీచు తయారవుతుంది. అందులో దరిద్రుడికి సంతాన వేణుగోపాలం అప్పుడిక నరకం సమీపంలోనే వుంటుంది వాళ్ళందరిని పోషించేదెలా అని నారాయణ వుద్దేశ్యం. ముసలాళ్ళవన్నీ చూస్తారూ! చస్తామని, ఆ ముచ్చట వుండగానే చూసిపోతామని ముడిపడిందనిపించారు పోనీ కాస్తోకూస్తో వున్నవాడా అంటే, నై నాలుగురోజులు నారాయణ పడుకుంటే ఆ ఇంటి శోభ భగవంతునికే తెలియాలి.

ఎవరేమయినా కాల మాగదుకదా! గిర్రున సంవత్సరం తిరిగింది నారాయణ పెళ్ళయి. నారాయణ గుండెల్లో రాయి పడ్డంత పనయింది పెళ్లాం ఆడపిల్లని కన్నదని వినగానే. బహుశః తన చెల్లెలి పెళ్లికి తను పడ్డపాట్లు జ్ఞాపకానికివచ్చివుంటాయి. "నాకోసినవాడు నీకోయడా అన్నాడు" ముసలాడు నేను పోతాను నా కొందు కన్నట్టు. "ఆడపిల్లుంటే ఇంటికే అందం" అంది తల్లి మాటవరసకి. ఎవరేమన్నా, కాకిపిల్ల కాకికి ముద్దే కదా! ఎవరే మనుకున్నా తన తొలినోముల పంటని చూసుకొని మురిసిపోయేది చంద్రమతి. వాత్సల్యానుసారంగా, అప్పుడప్పుడు నారాయణ పిల్లకి గౌనులూ అవీ కుట్టించి తెచ్చేవాడు.

కాలచక్రానికి విశ్రాంతి లేదు. సంవత్సరాలు దొర్లిపోతున్నాయి. ఎంతోమంది లోకాన్ని విడుస్తున్నారు. అంతకు మరిన్ని రెట్లు అవతరిస్తున్నారు. భవనాలు పూరిగుడిసెలవుతున్నాయి. శాస్త్రాభివృద్ధి నిరాఘాటంగా జరుగుతూంది దాని ఫలితంగా మానవులు దద్దరిల్లుతున్నారు. ప్రళయ బాంబులు సృష్టిస్తున్నారు— ప్రపంచం మారింది. ధనకాంక్షతో, కృత్రిమాలలో ప్రపంచం కుళ్లిపోతూంది నానాటికీ. కాలం మారిందిరా అబ్బాయి అన్నారు జుట్టు నెరిసినవారు. కాలంతోపాటు మనుష్యులు కూడా మారిపోయారు. మధ్య తరగతి మనిషి జీవితం అతి దుర్భరంగా తయారయింది. మానవహృదయాలు మార్దవరహితమవుతున్నాయి. తన్ను తాను పోషించుకోలేని గతికి వచ్చాడు—మానవుడు.

నారాయణ జీవితంలో నలభై సంవత్సరాలు ఖర్చయిపోయాయి. తల్లి తండ్రులస్థానే నారాయణ కిప్పుడు ఆరుగు రాడ పిల్లలు, ముగ్గురు మొగపిల్లలు. ఒక ఆడపిల్ల పుట్టిందని వినగానే దిగాలు పడ్డ నారాయణ హృదయం బహుశః బండబారి వుంటుంది. సంతానం పెరిగింది కాని సంపాదన పెరగలేదు. జీతం పెంచమంటే వీల్లేదంటాడు షావుకారు. వున్నగోడు కాస్తా చెడగొట్టుకోకుండా సంసారాన్ని వీధిలోకి తీసుకురాకుండా, గుట్టుగా సంసారభారంలో నారాయణ సతమతమవుతున్నాడు.

ప్రకృతికాంతకు స్వజాతిపై పక్షపాతమెక్కువ. తల్లి పేరెట్టిన పెద్దపిల్ల తాయారు, తరువాత ఏడాది తేడాగా పుట్టిన శకుంతల పెద్దదాని తరువాత నాలుగు నెల్లకే పెద్దదయి కూర్చుంది. నానాఅవస్థలుపడి పెద్దదాని తతంగం అయిందనిపించాడు. నాలుగు నెల్లకే మళ్లా—

గుండె ఆగిపోయినంత పనయింది నారాయణకు. షావుకారువద్ద పద్దులు వ్రాస్తుండగా వచ్చి చెప్పేడు చిట్టోడు. నోరు తెరచి, గుడ్లు తేలవేసి బొమ్మలాగ వుండిపోయాడు. షావుకారు కొడుకు సుబ్బులు "నారాయణా!" అని కేకవేసే టప్పటికి నీరుకమ్మిన గుడ్లతో వెర్రిగాచూస్తూ, తడారిపోయిన కంఠంతో వస్తున్నానండీ అన్నాడు. బహుశః ఎవరికీవినిపించివుండదు. ఎంత పాషాణహృదయుడయినా, ఆనాటి నారాయణ పరిస్థితి చూస్తే హృదయంలో కొంచెంఅయినా దయదలచకపోయి వుండడు. చిట్టోడు తండ్రివంక చూస్తూ బిక్కమొఖం వేసుకొని కూర్చున్నాడు. కొట్టులో సరుకులకు వచ్చిన జనం అంతా మూగజీవాల్లా వుండిపోయారు. సుబ్బులికానాడు నారాయణమీద ఎన్నడూ లేని దయ పుట్టుకొచ్చింది. నారాయణను ప్రక్కగా తీసికెళ్ళి ఇరవైరూపాయలిచ్చి అవసరం తీర్చుకో అన్నాడు. నారాయణ అలానే సందేహంగానే వుండిపోయాడు జీతంలో తెగ్గోస్తాడేమోనని. "జీతంలో తీసుకోనులే నారాయణా" అని సుబ్బులనగానే నారాయణ కళ్లు ఆనందంతో మెరిశాయి. ఎన్నడూ లేనిదయ ఈనాడు కలిగినందుకు, భగవంతుడిదమో, తన కూతురి అదృష్టమో అనుకున్నాడు.

షావుకారి పుణ్యమా అంటూ, ఆచారప్రకారం జరగవలసింది జరిపేడు నారాయణ. బావనీ చెల్లెల్ని తీసుకొచ్చాడు. వూళ్లో ఎరుగున్న నలుగురికీ, ఇంత అన్నం పెట్టాడా రోజున.

"కన్నె పడుచులున్న ఇంట్లోకి లక్ష్మి రాగోరుతుంది" అన్నారు పెద్దలనేవాళ్లు. "ఇంక అల్లుళ్ళను వెతకాలి" అన్నారు పరిహాస పూర్వకంగా నడివయస్సువాళ్లు.

నాలుగురోజుల తర్వాత బావని సాగనంపుతూ "పెద్దది మీ కోడలే" అన్నాడు నారాయణ.

నరసింహం నవ్వి వూరుకున్నాడు కాదులే అన్నట్టు "మాట్లాడ వేమన్నా మనం చిన్నప్పుడుకూడా అనుకొనేవాళ్ళం" అని చంద్రమతి ఆడబడుచుని కదలేసింది మాటల ధోరణిలో "మాకు కలిగిందేదో ముట్టజెప్పకపోం" అనేసింది. ముట్టజెప్పడం అనగానే నారాయణ గుండె దడదడ లాడింది.

చూస్తుండగానే నాలుగేళ్లు దొర్లిపోయాయి. తాయారుకిప్పుడు పద్దెనిమిదేళ్లు. తెల్లవారి లేస్తే "ఇంకా ఎప్పుడమ్మా బూరె ముక్కలు" అని అననివారిది పాపం. చంద్రమతి ఏదో చెప్పి తప్పించుకొనేది. బాల్యస్నేహితుడు గంగాధరం దగ్గరనుంచి ముఖపరిచయమున్న ప్రతివాడు "అల్లుళ్లను వెతుకుతున్నారా?' 'కట్నా లేమాత్రం పోగుచేశారు" అని అడిగేవాళ్లు. కట్నాలనగానే నారాయణ బేజారెత్తి పోయేవాడు. అందుచేత చాలాసార్లు బావకి కబురంపేడు. ఆయన దగ్గరనుంచి సమాధానం మాత్రం వూడిపడలేదు.

రాత్రి పదింటిదాకా కొట్లో పనిచేసి, పదింటికి కొట్టుమూసి పగలు షావుకారు కొన్న కాయగూరలు వగైరాలు ఆయనింటికి మోసుకెళ్లి, అక్కడనుంచి ఇంటికి వెళ్లేవాడు. నాలుగు చెంబులు దిమ్మరించుకొని, పట్టెడన్నం తిని వెన్నెల్లో నులకమంచంమీద మేనువాల్చి విశ్రాంతి తీసుకొంటూ వుంటే అతనికి తన యౌవనంలోని మధురాతి మధురములయిన రోజులు

జ్ఞప్తికి వచ్చేవి. వున్నంతలో బతికేవారు, వేరేచింత లేకుండా. ఇప్పుడో గంపెడంత సంసారం. రాబడి తక్కువ ఖర్చెక్కువ. ఇప్పుడు తాను చేయవలసింది చాలావుంది. ఆరుగురాడపిల్లలు. అప్పుడే ఇద్దరు పెద్దవాళ్ళయి కూర్చున్నారు. ప్రస్తుతంలో ఒక్కర్తె పెళ్ళయినా చెయ్యకపోతే కాకి మూకల గోల భరించరానిదిగా తయారయింది. తన కూతురికి ఇష్టంవచ్చినప్పుడు పెళ్లిచేస్తాడు. వాళ్లందరికి ఎందుకు అనుకునేవాడు. సంఘం బాధ భరించరానిదయి పోయింది. ఎద్దుపుండు కాకెక్కమి నెప్పి? బావగారి వూరువెళ్లి ఏదోసంగతి తేల్చుకొద్దామని నిశ్చయించుకున్నాడు.

షావుకార్ని బతిమలాడి రెండురోజులు సెలవుతీసుకొని బావదగ్గరకు బయలు దేరాడు. ఎప్పుడూ రానివా డొచ్చాడని నరసింహం చాలా గౌరవంగానే చూశాడు. ఆరాత్రి భోజనా లయ్యాక పెళ్లిమాట కదిపేడు.

"మీ కెరుగనిదే మున్నది. ఏమంటారు" అన్నాడు.

"మా శంకరాని కప్పుడే పెళ్ళేమిటోయి. ఎవరేనా వింటే నవ్విపోతారు" అన్నాడు మీ అమ్మాయిని చేసుకోము అని చెప్పలేక.

"మీ అబ్బాయి మీ కెప్పుడూ చిన్నవాడే. నాలుగేళ్లయింది పెద్దది పెద్దదయి ఎవరు చూసినా పెళ్లెప్పుడ నేవారే అంచేత త్వరలో చేసేద్దామని ఇలా వచ్చాను" అన్నాడు.

నరసింహం బెల్లంకొట్టినరాయిలా అలానే వుండిపోయాడు.

ఇంతసేపునుంచి తలుపు వెనకనించి చెవులు ఇటు పారేసి వింటూన్న నరసింహం ఇల్లాలు మొగుడు మాట్లాడకపోవటం చూసి "మీ అమ్మాయిని చేసుకోవటం నువ్విచ్చే కట్నంపై ఆధారపడి వుంటుంది" అన్నది సగౌరవంగా, ముసుకులో గుద్దులాటెందుకని అన్నగారితో.

నారాయణ హృదయంమీంచి మెయిలు కొనడియర్ ఇంజన్‌తో పరిగెత్తింది. నారాయణ పెళ్లాంమాట దాటినడిచే ఘటం కాదు. అందుచేత నారాయణ ఆశ నిరాశ చేసుకున్నాడు. 'కష్టేఫలీ' అన్న పెద్దల సుద్దులు జ్ఞాపకానికి వచ్చినాయి "మా పరిస్థితి మీకు తెలియందికాదు కదా అమ్మ ఆప్తబంధువులు మీకే కట్నాలు కావాలంటే ఇతరు లడగటానికి వచ్చిందా? నేనేమీ కట్నం ఈయలేను. పెళ్లికివచ్చిన వాళ్ళకింత పప్పూఅన్నమూ పెట్టగలను" అన్నాడు దీనాతిదీనంగా.

"అయ్యో! సంబడమా! ఇంతా పిల్లని చేసుకోమని వచ్చి ఇదా చెప్పేది. మంచి మాటే. అంత గతిలేనివాళ్లమనుకున్నావా మేము. బంధువులయితే మటుకు అంత తేరగా చేసుకుంటారా? వెయ్యిన్నూటపదహార్లు ఇస్తామనివస్తే కాదన్నారు యీయన. రెండువేలయితే ఏమో అనుకోవచ్చు, ఆడబడుచులాంఛనాలూ వెండిచెంబూ, పళ్లెం కాకుండాను" అందా గృహిణి దీర్ఘాలు తీస్తూ చేతులు తిప్పుకుంటూను.

"అమ్మ! ఇంటిల్లిపాతి రెండుపూటలా తింటానికే సరిపోని జీతంలో కట్నా లెక్కడనుంచి తెచ్చేది. నీవు నేను అన్నగార్నని, నీకుండాలిగాని; కట్నాలు కావాలి, లాంఛనాలు కావాలి అంటే మన ప్రేమ, బంధుత్వము కేవలం పాడు డబ్బుకోసం నశించిపోవలసిందేనా! బావకూడా మాట్లాడటంలేదు. నువ్వు సరే అంటే ఆయన కాదనలేడు." అని చెప్పిచూశాడు నారాయణ. ఏమీ ప్రయోజనం కనపడలేదు. నిష్కర్షగా చెప్పివేసింది వీలు లేదని ఆ మహాఇల్లాలు.

కొడుకు పెళ్ళితో తన కేమీ సంబంధం లేనట్టు నరసింహం కిమన్నాస్తిగా వూరుకున్నాడు. "అతనుమాత్రం పెళ్ళాంమాట కాదంటాడా" అని నారాయణ ఆశలు ఆరిపోగా ఆరాత్రే బరువెక్కిన హృదయంతోను, నీరుకమ్మిన గుడ్లతోను బయలు దేరాడు.

"ఇప్ప డెక్కడికి వెళతారు. అప్పుడే అర్ధరాత్రి అవ్వచ్చింది. రేపు ప్రొద్దున్నే బయలుదేరవచ్చు" అన్నాడు నరసింహం మాటవరసకి, ఆమాత్రంకూడా అనకపోతే బాగుండదని. "అక్కరకురాని చుట్టము..." అని తను చిన్నప్పుడు చదివిన పద్యం జ్ఞాపకానికి వచ్చి నారాయణ బయలుదేరి కదలిపోయాడు అక్కడనుంచి.

మేనరికమాశ తీరిపోయింది నారాయణకు. ఎరుగున్నవాళ్లందరితోను చెప్పాడు ఎక్కడయినా సంబంధం చూడమని. "మేనరిక మున్నదన్నారుగా?" "అయినా-కట్నం ఏమాత్రం?" ఇలా అడిగేవారు. కట్నం ఏమాత్రం అనగానే నారాయణ బెల్లంకొట్టిన రాయిలా అయిపోయేవాడు. కంఠంలో తడి ఆరిపోయేది. ఏదో చెపుదామనుకున్నప్పటికి నోటిలోంచి మాట వూడిపడేది కాదు.

మేనరికం అలా మండిపోయింది. ఎవరి నడిగినా కట్నాలు-కట్నాలు-ఏమాత్రం-అనేవారే కాని మరోప్రశ్న లేదు. ఇంకేం దారి? నారాయణకు భవిష్యత్తు చీకటిమయమయిపోయింది.

"భగవంతుడా! దయామయు డన్నారే నిన్ను. ఆప్తరక్షకుడవటకూడా. ఇది న్యాయమా స్వామీ. నేనేం పాపం చేశానని నా కారుగు రాడపిల్లల నిచ్చేవు." అని విలపించేనాడు. చివరికీ మనోవ్యథతో కృశించి కృంగిపోతున్నాడు నారాయణ.

దయామయుడైన భగవంతుడు నారాయణ దీనాలాపాలు విన్నాడేమో మరి. ఒకరోజున నారాయణ బాల్యస్నేహితుడు సుబ్బయ్య చెప్పాడు "వెంకటరెడ్డిగారబ్బాయి పెళ్ళికున్నాడని." వెంకటరెడ్డి నిజానికి ధర్మరాజులాటివాడు. వెళ్ళిచూడు అన్నాడు నారాయణతో షావుకారు.

నారాయణ పరిగెత్తాడు. ఈ సంబంధం కుదిరితే తిరుపతికొండకు వెళ్తానన్నాడు. సత్యనారాయణ వ్రతం చేస్తానన్నాడు. ఇలా అనేకం అనుకుంటూ వెళ్లాడు నారాయణ.

ఎంతో మర్యాదగా ఆహ్వానించేడు వెంకటరెడ్డి నిజానికి వెంకటరెడ్డి ధర్మరాజులాటివాడే. అయితే చుట్టూ వున్నవి దుష్టగ్రహాలు. మాసినగడ్డం, మాసికలతోనిండిన గుడ్డతో వున్న నారాయణను చూచి వెంకటరెడ్డి అసహ్యించుకో లేదు సరికదా జాలి కలిగింది. వచ్చిన పనేమిటని అడిగాడు.

"మీ..."అని మింగేశాడు నారాయణ.

"ఏమిటన్నారు" అన్నాడు రెడ్డి.

"మీ అబ్బాయి—"అని మళ్ళీ గొణిగాడు నారాయణ.

"చల్లకువచ్చి ముంత దాచటమెందుకు చెప్పండి" అన్నాడు రెడ్డి.

"మీ అబ్బాయికి మా అమ్మాయిని..."

"అలాగే చూద్దాం." అనేశాడు వెంకట

రెడ్డి ఆలోచించకుండానే

నారాయణ హృదయంలో ఆశాంకురం నాటుకొంది. కాని ఎంతోసేపు పట్టలేదు. అది నశించేందుకు.

"పిల్లవాడికేదయినా ఉద్యోగం ఇప్పించి చేసుకోండి" అన్నాడు రెడ్డి.

ఏడిసినట్టే వుంది ఉద్యోగం ఇచ్చే స్థితిలో వుంటే తనకీ గతేంకాలె కర్మం. "అలాగా! చూస్తానులెండి. మళ్లీ కలుసుకుంటాగా!" అని లేచి గుమ్మందాకా వెళ్ళి మళ్ళీ ఏదో జ్ఞాపకంవచ్చి వెనక్కి తిరిగివచ్చి "అన్నట్టు అబ్బాయి ఏం చదువుకున్నాడన్నారు."

"ఆ! ఎంతోనా తరుడుఫారం ఫేలయి వూరుకున్నాడు" వెంటనే మళ్లీ మాట్లాడకుండా వెళ్లిపోయాడు నారాయణ. తర్డుఫారం ఫేలయినవాడికి ఉద్యోగమేమిటి... అయినా, నేనా ఇప్పించేది చాల బాగుంది బి. ఏలు, ఎమ్. ఏలు ప్యాసయి ఉద్యోగాలు లేక ఏడుస్తున్నవాళ్లు ఏడుస్తుండగా వీడికి వుద్యోగం ఏమిటి?" అనుకున్నాడు నారాయణ.

బి. ఎ. బి. ఎల్. పాసయి, ప్లీడరీపెట్టుకోనేందుకు డబ్బులేక ఒకవేళ పెట్టుకొన్నా నాలుగయిదేళ్లదాకా నూట్లు ఇస్త్రీకన్నా డబ్బులురావని, టైపిస్టుగా చేరి నెలకి అక్షరాలా అరవైరూపాయలు సంపాదిస్తున్నాడని చెప్పిన షావుకారు మాటలు జ్ఞాపకానికివచ్చి, నారాయణ ఆశ పటాపంచలైపోయింది.

నారాయణ జరిగినదంతా షావుకారుతో చెప్పాడు. షావుకారు కాసేపాలోచించి "నేను స్కూలుఫైనల్ చదువుకొనేటప్పటి స్నేహితు డొకడు ఇప్పుడు ఈవూరి పోస్టుమేస్టరుగా వచ్చాడు. చెప్పిచూస్తాను. ఏ పోస్టుమేన్ ఉద్యోగంఅయినా ఇప్పిస్తాడు ఆపైన నీ అదృష్టం" అనేసి వూరుకున్నాడు.

ఆ మరునాడు సెట్టి రామారావుని తీసుకొని తన పాతస్నేహితుని దగ్గరకు వెళ్లి అంతా వివరించి ఎలాగయినా ఏదో వొక ఉద్యోగం ఇప్పించాలని ప్రాధేయపడ్డాడు. పోస్టుమాస్టర్, తన స్నేహితుని రికమండేషన్ వల్లనయితేనేమి, పోస్టుమేన్ అవసరముండయితేనేమి, రామారావుని ఆ తక్షణం పోస్టుమేన్‌గా, ఆ వూళ్లోనే వేసినట్టుగా ఆర్డర్స్ ఇచ్చాడు.

"నారాయణా! ఈవాళ ఆ పోస్టుమేస్టర్ వద్ద ప్రాధేయ పడినట్టుగా నా జన్మలో నే నెవరిదగ్గరా అలా ప్రాధేయ పడలేదు నిన్ను చూసి అలా చేయవలసి వచ్చింది. చెప్పినందుకు కాదనకుండా పని ఇచ్చేడు. మంచివాడు" అన్నాడు షావుకారు నారాయణతో.

భగవంతుడు ఈనాటికయినా దయ చూపించేడు అనుకొని నారాయణ కులాసాగా ఆ రోజు గడిపేడు. పోస్టల్ వాళ్ల పుణ్యమా అని బి. ఎ. కన్నా ఎక్కువగా సంపాదిస్తున్నాడు రామారావు. నారాయణ అమ్మయ్య అనుకున్నాడు. ఇక పెళ్ళే తరువాయి.

కాని విధి బలీయమయినది పెళ్ళికొడుకు, వెంకటరెడ్డి, అంగీకరించారు కాని, ఆడ శిఖండీలు పడనివ్వలేదు. "నిత్తే పంలా నెలకి 60 రు. తెచ్చుకుంటున్నాడు. ఇంకే సంబంధమయినా అయితే షుమారు రెండువేలకి తక్కువ రావు కదా! పైగా చిన్న అమ్మాయి పెళ్లి చేయాలి. ఎదిగి కూర్చుంది. దానికి కట్నం ఎక్కడ నుంచి తెస్తారు. దీపం వుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. ఇప్పుడు కాకపోతే మరెప్పుడు వెనక వేస్తారు నాలుగురాళ్లు" అంటూ దీర్ఘాలు తీస్తూ రెడ్డిభార్య అనేటప్పటికి రెడ్డిగాని, రామారావు కాని కాదనలేకపోయారు.

నారాయణ హతాశుడై వెళ్లిపోయాడు. కొంచెం ఇంచుమించుగా పిచ్చివాడయ్యేడు. మాసిన గడ్డం, చిరిగి మసిగుడ్డలైన బట్టలు, తనలోనే తాను మాట్లాడుకోవటం ఇవన్నీ చూచి నారాయణకు పిచ్చెక్కుతుందనుకున్నారు ఎరుగున్నవాళ్లంతా.

"ఎంత పని చేశాడు వుండాకోరు" అని కొట్టి పళ్లు కొరికాడు. "ఇంత ఘోరమా! ఇంత అన్యాయమా!" అని ప్రజలు ముక్కుమీద వేలేసుకున్నారు. ఎవరేమంటే ఏం లాభం అందరిలాగే ఈ సమయంలో నారాయణకు తోడుపడేవాడు నిజంగా వున్నాడా? అనే సందేహం వచ్చింది.

పది రోజుల తర్వాత తెలిసింది, ఎవరో రెండు వేల అయిదు వందలకు మాట్లాడుకొని, అయిదువందలు బజానా ఇచ్చి వెళ్లారని ఆతరువాత నెల్లాళ్లకి రామారావు పెళ్లయింది. వూరేగింపు నారాయణ గుమ్మం ముందుగానే వెళ్ళింది. నారాయణ గుమ్మంముందు రామారావు పెళ్లికూతురులా తలవంచుకున్నాడు. ఎవరూ అది గమనించనేలేదు. నారాయణ హృదయం చేత్తో కెలికినట్టయింది. విచారించి లాభంలేదని ఇప్పటికతని కర్థమయింది.

నారాయణ వరాన్వేషణ మానలేదు—ఎలా మానగలడు? ఎలాగో తెలిసింది తాపీ సుబ్బారెడ్డికొడుకు పెళ్లి ఈడువాడని. నారాయణకి తెలుసు సుబ్బారెడ్డి కుటుంబం సంగతి. సుబ్బారెడ్డి అరవైయోపడిలో వాడు అతనికో కూతురు, కొడుకు పెళ్లికివున్నారు. అతనికి తాపీ పనుంటే రెండురూపాయిలొస్తాయి, లేనినాడు మూడంకె వేసి పడుకోవలసిందే. అయినా నారాయణకి ఏలితి కనపడలేదు. అల్లుడు తాపీవాడని కించపడలేదు. కట్నాల ప్రసక్తి రాదని గట్టిగా నమ్మేడు. ఆ సాయంత్రం నాలుగుగంటలవేళ "ఎప్పుడు తిరుగుతూవురలే కొట్లో చూసే దెవరు" అంటూన్న షావుకారుని బతిమాలుకొని సుబ్బారెయుడింటికి బయలుదేరాడు. వెళ్లీవెళ్లడంలోనే ముసుగులో గుద్దులాటెందుకని "మా పెద్ద అమ్మాయిని, మీ అబ్బాయికిస్తే బాగుంటుంది. మన ఇద్దరం ఒకలాగే వున్నాం. ఆ యిద్దరికీ జోడు కూడా బాగుంది" అన్నాడు.

(46-వ పేజీ చూడండి)

సీరియల్ నవల

# రెండు మహానగరాలు

చార్లెస్ డికెన్స్

## 7

వంచిన తలఎత్తకుండా తదేకధ్యానంగా కూర్చుని చెప్పులు కుడుతున్న ఆ వ్యక్తిని, మాన్సియర్ డిఫార్జ్ నెమ్మదిగా పలకరించాడు :

'గుడ్ డే!'

ముగ్గుబుట్టలా నెరిసి పీచులుతేగివున్న ఆ తల నెమ్మదిగా పైకి లేచింది; క్షణంసేపు విర్రాంతిపడి చూసి, 'గుడ్ డే!' అని గొణిగాడు, ఆ వ్యక్తి; ఏదో నూతిలోనుంచి మాట్లాడుతున్నట్టు అయోమయంగా, అస్పష్టంగావుంది, ఆగొంతు.

'పాపం!—ఇంకా కష్టపడి పనిచేస్తూనే వున్నారు?'—

చాలాసేపటివరకు సమాధానం చెప్పలేదు. ఒక క్షణానికి నెమ్మదిగా మరో పర్యాయం తల పైకెత్తి:

'ఆఁ!—చేస్తున్నాను'—

ఆ సమాధానం చెప్పి డిఫార్జ్ వంక కాసేపు నిర్జీవంగా చూసి, మళ్లా తల దించేసుకున్నాడు.

ఆ హీనస్వరం వింటే, జాలీ, భయమూకూడా కలుగుతుంది; పళ్ళతరబడి ఖైదులో ఒంటరిగావుండి అనేక కష్టనిష్ఠురాలు అనుభవించివున్న కారణంచేత చిక్కి శల్యావశిష్టుడై వున్నమాట నిజమే అయినా, ఆ హీనస్వరం, కేవలం బలహీనత కారణంగా యేర్పడ్డదికాదు; సంవత్సరాల తరబడి పలకరించే దిక్కులేక మాట్లాడే అలవాటు తప్పిపోయింది; మానవ కంఠానికి సహజంగా వుండే జీవం, పలుకూ నశించి, ఏనాడో మాట్లాడిన శబ్దాల ప్రతిధ్వనిలా వుంది పూర్వం ఒకప్పుడు ఉజ్వలమైన రంగులలో వుండి, కాలగతిని వివర్ణమై అస్పష్ట రేఖలుగా కనిపించుతున్న రంగుల చిత్రంలా వుంది. నిరాశా కూపంలో అణగారి పోతున్న దీనారావం; సహారా యెడారిలో త్రోవతప్పిన బాటసారి, మరణావస్థలో కంఠగత ప్రాణంగా, కడసారి భార్యాబిడ్డలు తలపుకువచ్చి గుటకలుమ్రింగుతున్న అస్పష్ట శబ్దాల కళవళం.

'ఇంకా కొంచెం వెలుగు భరించగలరనుకుంటాను—కిటికీ ఇంకొంచెం తెరుస్తాను'—

'తెరిస్తే భరించవలసే వస్తుంది' అన్నాడా వ్యక్తి, దీనంగా.

అర్ధార్ధంగా తెరిచివున్న కిటికీ రెక్క డిఫార్జ్ మరి కొంచెం తెరిచాడు. మరికొంత కాంతి లోపలపడ్డది. చెప్పులు కుడుతున్న ఆ వ్యక్తి యిప్పుడు ఇందాకటికంటే మరింత స్పష్టంగా కనిపించుతున్నాడు. చెప్పులు కుట్టే చిన్ని చిన్ని సామాన్లూ తోలు ముక్కలూ, ఆయన పాదాల దగ్గిర చిందరవందరగా పడున్నయ్.

తెల్లబడి, గిజగాడి గూడులావున్న చిన్నిగడ్డం గొగ్గులు గొగ్గులుగా కత్తిరించివుంది. పీక్కుపోయిన ముఖం, కోలిమిగుంటల్లా ఈ లోతుకు దించుకుపోయిన కనుగుంటల్లో కనుగుడ్లు నిప్పుకణికల్లా మెరుస్తున్నయ్. చిక్కొగ్గా పీచులుతేగి జీబూతంలా వున్న తలా, నల్లగా కావురేసిపోయిన కనుబొమ్మలూ కమ్మేస్తున్నయ్ గాని, లేకపోతే, బొమికెలు తేలి ముడుచుకుపోయిన ఆ ముఖంలో ఆ కళ్లు విశాలమైనవిగా కనుపించాలిసిందే. చినిగి వెలిసిపోయిన పసుపుపచ్చ చొక్కా కాలరులో నుంచి మెడ బొమికెలు బయటికి పొడుచుకొచ్చినై.

కిటికీ తెరిచేసరికి ఆ వెలుగు భరించలేక అరచెయ్యి కళ్లకు అడ్డం పెట్టుకున్నాడు. ఉల్లిపొరలా వున్న చర్మంలో నుంచి వెలుగు రేఖలు చొచ్చుకుపోయి అరచేతిలోవున్న బొమికెలు కూడా స్పష్టంగా కనుపించుతున్నయ్. ఏదైనా ధ్వని వినిపించితే ఆ ధ్వని యేవేపునుంచి వచ్చిందో, కాసేపు యిటూ అటూ పారజూచుకుంటేగాని గ్రహించలేడు. ధ్వనినీ ప్రదేశాన్నీ సమన్వయం చేసుకునే శక్తి ఆయనలో నన్నగిలిపోయింది. ఆయన మాట్లాడనే మాట్లాడడు. అథవా మాట్లాడినా, మాట్లాడుతూన్న సంగతి మధ్యలో మరిచిపోయి మెదలకుండా ఊరుకుంటాడు.

'ఆ చెప్పులు యీ వేళ పూర్తి చేస్తారా?' అని ప్రశ్నించాడు డిఫార్జ్, దగ్గిరికి రమ్మని లారీకి కన్నుగిలుపుతూ.

'ఆఁ!—ఏమిటి?'—

'ఆ చెప్పులు ఈవేళ పూర్తిచెయ్యాలనుకుంటున్నారా?'

'అనుకుంటున్నానేమో — చెప్పలేను —అనుకుంటున్నట్లేవుంది—తెలీదు'

ఆ అమ్మాయిని గుమ్మందగ్గిర వదిలేసి, లారీ నెమ్మదిగా ముందుకొచ్చి, డిఫార్జ్ ప్రక్కనే నిల్చున్నాడు. కొంతసేపటికి చెప్పులుకుడుతున్న ఆ వ్యక్తి తల పైకెత్తి చూశాడు. మరో వ్యక్తి ప్రక్కని నిల్చున్నట్టు కనుపించినా, ఆయన ఆశ్చర్యపడ్లేదు. చూసినట్టు చూసి మళ్ళీ తల దించేసుకుని తన పనిలో తాను నిమగ్నుడైనాడు.

'ఒక పెద్దమనిషి మిమ్మల్ని చూట్టానికి వచ్చారు'—అన్నాడు, డిఫార్జ్.

'ఆఁ!—ఏమిటి?'

'ఒక పెద్దమనిషి—మిమ్మల్ని చూట్టానికి వచ్చారు—ఇదుగో ఈయనే.'

చెప్పులు కుడుతున్న ఆ వ్యక్తి ఇందాకటి మోస్తరుగానే తల పైకెత్తి పరకాయించి చూచాడు కాని పనిచేస్తున్న చెయ్యి యింకా చెప్పుమీదేవుంది.

'ఏదీ ఆ చెప్పు యిలా యివ్వండి—ఈయనకి చెప్పుల సాకెం బాగా తెలుసు—మీరు కుడుతున్న చెప్పు యిలా యివ్వండి!—తీసుకుచూడండి సర్!'—

లారీ, సగంవరకు తయారైవున్న ఆ చెప్పు అందుకుని చూస్తున్నాడు.

అనువాదం: తెన్నేటి సూరి

'అది యేరకం చెప్పో అయ్యగారికి చెప్పండి—తయారీదారు పేరు కూడా అడుగుతున్నారు చెప్పండి'—

చాలా సేపటికిగాని ఆయన జవాబు చెప్పలేదు.

'ఆఁ!—ఏమిటీ అడిగారూ?—మరిచిపోయాను—ఏమిటీ అన్నారు'

'అది ఏ రకం చెప్పో చెప్పమంటున్నారు అయ్యగారు.'

'ఆడవాళ్లు తొడుక్కునే చెప్పు; మీ కారు వెళ్ళేటప్పుడు ఆడవాళ్ళు తొడుక్కునే చెప్పు. కొత్త నాయూనా—దీనికి పాత నమూనా యేమీ లేదు.'

'తయారీదారు పేరు అడుగుతున్నారు', అన్నాడు డిఫార్జ్;

ఆయనకు ఆ మాట వినిపించినట్టులేదు; చేతిలో పనేమీ లేక కుడిచేతి మెటికలు ఎడంచేత్తోనూ, ఎడంచేతి మెటికలు కుడి చేత్తోనూ విరుచుకుంటూ మధ్యమధ్య గడ్డం గోక్కుంటున్నాడు. మన లోకంలో వున్న మనిషిలా లేడు మూర్ఛాగతుడై వున్నవాణ్ణి పలకరించటం ఎంత కష్టమో ఆయన్ని పలకరించటం అంత కష్టం. కొంతసేపు పెగుల్చుకు ఏదో కలలోనుంచి మాట్లాడుతున్నట్టు:

'మీరు...నా పేరు అడిగారా?'—

'అవును—చెప్పండి'—

చాలాసేపు తీవ్రంగా ఆలోచించి 'నూట అయిదు, నార్త్ టవర్' అన్నాడు.

'అంతేనా—ఇంకేమీ లేదూ'—

'నూట అయిదు, నార్త్ టవర్'—అంటూ బాధగా గొణిగేసి తిరిగి తనపనిలో తాను మునిగిపోయాడు.

'చెప్పులు కుట్టడం మీ వృత్తి కాదనుకుంటాను' అన్నాడు, లారీ, ఆయన కేసి తేరిపార దీక్షగా చూస్తూ.

ఆయన సమాధానం చెప్పలేదు—'ఆ ప్రశ్నకు సమాధానం నువ్వు చెప్పు' అన్నట్టు డిఫార్జ్ ముఖం వంక దీనంగా చూశాడు; కాని డిఫార్జ్ అలాంటి సహాయమేమీ చెయ్యక మెదలకుండా నిల్చునుండటం చేత, తిరిగి లారీ వంక చూసి:

'కాదు—ఇక్కడికొచ్చిన తరవాత నేర్చుకున్నాను—నా అంతటికి నేనే నేర్చుకున్నాను—నేర్చుకోటానికి అనుమతి తీసుకున్నాను—అతి కష్టంమీద చాలా రోజులకి అనుమతించారు అప్పటినుంచీ కుడుతూనే వున్నాను.' ఈ నాలుగుమాటలూ చెబుతూనే, లారీ చేతిలో వున్న చెప్పుకోసం చెయ్యి చాచి అందుకోబోయాడు. లారీ ఆయన వంక తీవ్రంగా చూస్తూ:

'మాన్సియర్ మానెట్—మీరు నన్ను గుర్తుపట్టలేరా?' అన్నాడు, చేతిలో వున్న చెప్పు జారి క్రింద పడిపోయింది. లారీ ముఖంవంక మ్రాన్పడి చూస్తున్నాడు.

'మాన్సియర్ మానెట్;' లారీ డిఫార్జ్ భుజంమీద చెయ్యి వేసి చూపించుతూ: ఈ మనిషి వంక పరీక్షగా చూడండి! ఇతనెవరో జ్ఞాపకం తెచ్చుకోవటానికి ప్రయత్నించండి; బ్యాంకులో ఉద్యోగం చేస్తూవుండేవాణ్ణి—బ్యాంకీ, వ్యాపారం స్మృతికి రావటంలేదూ—పూర్వం ఇతను మీ దగ్గర నౌకరుగా వుండేవాడు—ఇతని వంక చూడండి!—ఇవన్నీ మీకు జ్ఞాపకం రావటం లేదూ?'

అనేక సంవత్సరాలుగా అజ్ఞాతంలో వుండి జీవిత సర్వస్వాన్నీ విస్మరించిన ఆ ఖైదీ తన పూర్వచరిత్రను తలపుకు తెచ్చుకోవటానికి నానా తంటాలూ పడుతున్నాడు. ఏనాడో, అదృశ్యమైపోయి అంతరించిపోయిన యౌవనరేఖ, ఆయన నుదురుమీద క్రమ్మి వున్న చీకటి తెరను ఛేదించుకుని మిలమిలగా పొటమరించటానికి ప్రయత్నించింది. కాని మళ్లా మరుక్షణంలో ఆ వెలుగురేఖను చీకటి క్రమ్మేసింది.

కుమ్మంలో నిల్చునున్న ఆ యువతి గోడప్రక్కగా బల్లిలా పాకి దగ్గిరికివచ్చి నిల్చునుంది. చెప్పులుకుట్టే వ్యక్తి నుదురుమీద ఆ ఉజ్వలరేఖ మిలమిల లాడగానే, అంధకారం ఆవరించి వున్న ఆ యువతి నుదురుమీద కూడా వెలుగురేఖ పొటమరించింది. జీవితంలోకి మేల్కొనటానికి తన్నుకులాడుతున్న ఆ శిరస్సును తన హృదయానికి హత్తుకుని సేదదీర్చి పునర్జన్మ నివ్వాలనే ఆవేశంతో చేతులు రెండు ఆవిడకు తెలియకుండానే ముందుకు చాచుకుంటున్నయ్. గజగజలాడుతున్న జాలి పేగులతో పాటు చేతులుకూడా వణకిపోతున్నయ్.

ఆయన నుదురు కావురు వేసినట్టు అయోమయమైపోయింది. వాళ్లిద్దరివంకా చూస్తున్న చూపులు కూడా మందగించి దించుకు పోయినై, నిస్పృహగా నేలవంక చూశాడు—ఒక పెద్దనిట్టూర్పు విడిచి, చేతిలో వున్న చెప్పులో ఆర దిగబొడిచి తిరిగి కుట్టడం ప్రారంభించాడు.

డిఫార్జ్ లారీ చెవిలో నోరుపెట్టి రహస్యంగా అడిగాడు: 'ఆయన్ని గుర్తించగలిగారా?'—

'ఆ—క్షణమాత్రంగా ఆయన ముఖంమీద నిలిచి అదృశ్యమై పోయిన పూర్వపు పోలికను గుర్తించాను—మొదట నిజంగా నిరాశచేసుకున్నవాణ్ణే—హుష్!—మనం కొంచెం దూరంగా వెనక్కు వెడదాం పద, హుష్!'—

ఆవిడ, అడుగులు తడబడుతూ నెమ్మదిగా ఆ వ్యక్తి కూర్చున్న బెంచీ దగ్గిరికి వచ్చింది. తలవంచుకు ముందుకు వంగి కూర్చుని పనిచేసుకుంటున్న ఆయన భుజాన్ని మునివేళ్ళతో తాకింది ఆయన ఆ హస్తస్పర్శను గ్రహించలేదు.

నోరు మెదిపి ఒక్కమాట మాట్లాడలేదు. దేహంలేని ఆత్మలా ఆయన వెనక మౌనంగా నిల్చుని వుంది. ఆయన మౌనంగా కూర్చుని చెప్పులు కుట్టుకుంటున్నాడు.

ఇంతలో ఆయనకు తోలు ముక్క కొయ్యటానికి కత్తి కావలసి వచ్చింది. అది ఆ అమ్మాయి నిల్చున్న వైపున కాక, రెండో వేపున పడివుంది అటు ప్రక్కగా జరిగి తీసుకుని తిరిగి మళ్ళీ చెప్పు మీదికి వంగబోతున్నాడు. ఆ జరగటంలో ఆ అమ్మాయి తొడుక్కున్న గౌనుఅంచులు ఆయన కళ్ళబడ్డయ్. తల పైకెత్తి చూశాడు. ఆ ముఖంవంక రెండుకళ్ళూ అప్పగించి చూస్తున్నాడు. కత్తివిసిరేస్తాడేమోనని హడలిపోయి లారీ డిఫార్జ్‌లు యిద్దరూ ముందుకు అడుగు వెయ్యబోయ్యారు. ముందుకు రావద్దని చేతితో వారించింది.

అలా తేరిపారజూస్తున్నాడు—అదో భీభత్సంగా. పెదవులు తడబడుతూ ఏదో గొణగబోయాడు. మాట పెగల్లేదు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కూడా సరీగా ఆడటంలేదు. కొంచెంసేపు అలా సదమదమై ఏదోవిధంగా మాట పెగుల్చుకుని:

'ఏమిటిదీ!—'

చెక్కిళ్ళమీదుగా జొటజొటా కన్నీరొలికిపోతున్నది. ఆయనపట్ల కలిగిన ఆప్యాయతనంతా సూచించుతూ. తన చేతులు తాను ముద్దుబెట్టుకుని, శిథిలమైపోయిన ఆయన శిరస్సునే హత్తుకుంటున్నట్టు హృదయానికి హత్తుకున్నది

'నువ్వు.. జైలరు కూతురివి కాదా?—'

'కాదు'—కన్నీరు విడిచింది.

'హాఁ—ఎవరు?—'

తనకు సరీగా మాట పెగుల్తుందనే ధైర్యం ఇంకా చిక్కలేదు; నెమ్మదిగా ఆయన ప్రక్కనే బెంచీమీద కూర్చుంది. వెనక్కు తప్పుకోవటానికి ప్రయత్నం చేశాడు. కాని, ఆయన దండ చేతిమీద చెయ్యివేసి వారించింది. ఆ స్పర్శతో ఆయన నాళనాళాలలోనూ ఏదో విద్యుత్తు ప్రవహించినట్లయింది. ఆ చైతన్యం ఆయన ముఖంమీద కూడా స్ఫురించుతోంది; చేతిలో

వున్న కత్తి నెమ్మదిగా క్రిందపెట్టి, విభ్రాంతుడై ఆ యువతి ముఖంలోకి తేరిమాస్తూ కూర్చున్నాడు.

ఆ ఆలజడిలో బంగారు వర్ణంలోవున్న ఆవిడ గిరజాలజుట్టు భుజంమీదుగా ముందుకు పడ్డది. నెమ్మది నెమ్మదిగా చెయ్యి చాచి ఆ జుట్టు తన అరచేతిలోకి తీసుకుని పరిశీలించుతున్నాడు. మళ్లా మరుక్షణంలో ప్రక్కకు తిరిగేసి, పెద్దనిట్టూర్పు విడిచేసి చెప్పుకుట్టటానికి మొదలుపెట్టాడు.

అతని దండ చెయ్యి వదిలేసి, ఇంకా సన్నిహితంగా భుజంమీద చెయ్యివేసి కళ్ళల్లోకి చూసింది. ఆ చెయ్యి నిజంగా తన బుజంమీద వుందా లేదా అనే అనుమానం తీర్చుకోవటానికి ప్రయత్నించుతున్నవాడులా, రెండుమూడుసార్లు ఆ చెయ్యివంక చూసి, చివరికి తన చేతిలోవున్న పని నెమ్మదిగా క్రింద పెట్టేశాడు. మెడ తడిమి చూసుకుని ఒక నల్లటిదారం బయటికి తీశాడు. ఆ దారానికి చిన్ని గుడ్డమూట తాయెత్తులా కట్టివుంది. ఆ మూటను మోకాలిమీద పెట్టుకుని అతి జాగ్రత్తగా ఊడదీశాడు. దాల్లోనుంచి చిన్నితల వెంట్రుకలచుట్ట బయటికితీశాడు. బారాటి రెండుమూడు బంగారు వెండ్రుకలు; వాటిని యేనాడో తన చిటికెనవ్రేలుమీద చుట్టి అలా భద్రపరిచాడు.

ఆ యువతి తలవెండ్రుకలను చేతిలోకి తీసుకొన్నాడు. తాను బయటికి తీసిన వెంట్రుకలను దగ్గరసా పెట్టి రెంటినీ పరిశీలించుతున్నాడు:

'అవే వెంట్రుకలు!...ఎలా సాధ్యం?...ఎలా సాధ్యం'—

ఆయన నుదురులో తీవ్రమైన యోజనశక్తి ప్రభవించింది. ఆయువతి ముఖంలోకూడా అదేరకం చైతన్యం స్ఫురించటంకూడా ఆయ గమనించాడు. ఆవిడ ముఖాన్ని పట్టుకుని వెలుగువైపుకు తిప్పిపరిశీలనగా చూస్తున్నాడు.

'ఆ వేళవాళ్లు నన్ను తీసుకుపోవటానికి వచ్చినప్పుడు నా బుజంమీద తలపెట్టియేడ్చింది. నన్ను వాళ్లు 'నార్త్‌టవరు'కు తీసుకువచ్చినతరవాత, యీ వెంట్రుకలు, వాళ్ళకి నా బుజంమీద కనుపించాయి. అవి నా కివ్వమన్నాను. అవి నా ఆత్మను ఖైదులోనుంచి విముక్తి చేయగలిగితే చెయ్యవచ్చుగాని, శరీరాన్ని చెయ్యలేవు గదా—దయవుంచి యివ్వమన్నాను—సరీగా ఆ వేళ అవే నేనన్న మాటలు—నాకు బాగా జ్ఞాపకం' ఈ ప్రసంగాన్ని లోలోపల మననం చేసుకుంటూ నెమ్మది నెమ్మదిగా అంచలమీద ముగించాడు.

'ఇదంతా ఎలా సంభవం?—నీవేనా?'

అతను హఠాత్తుగా ఆ స్త్రీముఖం వంక అలా విభ్రాంతుడై చూడడం గమనించి, భయపడి ఆయిద్దరూ మళ్ళా ముందుకు రాబోయారు. కాని అతిశాంతంగా కూర్చుని; అయ్యా; దయవుంచి దగ్గిరికిరాకండి—మాట్టాడకండి' అన్నది.

'ఆఁ ఏవిటీ!'—బిగ్గరగా అరిచాడు: 'ఎవరి దా గొంతు!'

కేక వెడుతూనే, ఆ అమ్మాయి చేతులు వదిలేసి, వెర్రెత్తిపోయినవాడులా జుట్టు చికాగ్గా పీకేసుకున్నాడు. ఒక్క క్షణంలో మళ్ళీ ఆ చికాకంతా అణగిపోయింది; గబగబా ఆ తల వెంట్రుకల చుట్టను మూటగా చుట్టపెట్టేసి దాచేసుకోవటానికి ప్రయత్నించుతున్నాడు: కాని యింకా ఆ స్త్రీ ముఖంలోకి చూస్తూనే వున్నాడు: దుఃఖం ముంచుకొస్తున్నట్టు రుద్ధకంఠంతో గొణుగుతున్నాడు.

'ఊహూహూ!—నువ్వు కాదు—కాదు—నువ్వు చాలా చిన్నపిల్లవుగా వున్నావ్—చాలా మిసమిసగా వున్నావ్—కాదు నవ్వు కాదు. ఖైదీ అంటే ఎలావుంటాడో చూశావా—అది చూసిన చేతులు యివి కాదు—అది ఎరిగినముఖం, యిదిగాదు—అది విన్న కంఠధ్వని యిదిగాదు—అదంతా వేరు—ఎప్పుడో సంగతి...'నార్త్‌టవర్' పూర్వం సంగతి — అదీ ... నేనూ...

(21-వ పేజీ చూడండి)



శ్రీ కొండేపూడి సూర్యప్రకాశరాజు

గడచిన అయిదారు సంవత్సరాలనించీ ఆ వృద్ధ దంపతులు ఆ వూళ్లో నివసిస్తున్నారు. ఆయన పేరు సుబ్బయ్య ఆవిడ పేరు సీతమ్మ. పూర్వం వాళ్లెక్కడుండేవారో, వారి పుట్టుపూర్వోత్తరా లేమిటో ఆ వూరి వారెవరికీ తెలీదు. బహుశా ఆయన ఏదో వుద్యోగంనించి రిటైరయి జీవితశేషాన్ని ప్రశాంతంగా గడపటానికి గాను అటు పల్లె కాకుండా, యిటు పట్నం కాకుండా మధ్యరకంగా వున్న ఆ గ్రామానికి వచ్చివుండొచ్చు.

దేహపరిశ్రమకు గాను సుబ్బయ్య ప్రతి రోజూ ఉదయం సాయంత్రం కూడా కనీసం రెండు మైళ్లయినా నడిచి వస్తుంటాడు. అతనికి డబ్భైఅయిదు సంవత్సరముల వయసు వున్నప్పటికీ శరీరం మాత్రం కృంగిపోలేదు; అడుగు కూడా తొందరగానే పడుతుంది. అతని శరీరచ్ఛాయ జాగ్రత్తగా భద్రపరచిన నిల్వబత్తాయి పండుయొక్క అస్వాభావికమైన రంగుతో పోల్చొచ్చు.

సీతమ్మ ఎప్పుడూ యిల్లు వదలి బయటకు వెళ్ళేది కాదు. కూరగాయలు, పాలు మొదలైనవి అమ్మటానికి యింటికి వచ్చిన వాళ్లతో తప్ప మరెవ్వరితోనూ మాటాడి ఎరగదు. ఆమె తన భర్తకంటె చాలా చిన్నదయినా పెద్దదానిలాగ కనపడుతుంది. ముడతలు పడిన ముఖం, నెరసిన జుట్టు, సులోచనము ధరించిన కళ్లూ మొట్టమొదట ఆకర్షిస్తవి. జాగ్రత్తగా ఆమె ముఖాన్ని పరిశీలిస్తే సుఖమనేది ఎన్నడూ ఎరగనట్టు కనపడుతుంది. పనిమనిషి ఎల్లమ్మ సహాయంతో ఇంటి పనులన్నీ ఆమే చక్కబెటుకుంటుంది. ఎల్లమ్మ చీకటితోనే వచ్చి గదులు చిమ్మి అంట్లుతోమి వెళ్ళిపోతుంది. మళ్ళీ సాయంత్రం వచ్చి యించుమించు అదే పనిచేసి వెళ్తుంది. కూరలూ, నీరలూ యింటివద్దకే అమ్ముకు రావటంవల్ల ఏ వారానికో, ఏ పది రోజులకో తప్ప మార్కెట్టుకి వెళ్ళే పని ఆమెకు తగిలేది కాదు. దంపతులు దగ్గరగా వుండటం కాని, మాట్లాడుకోటం కాని చూసే అవకాశం ఎల్లమ్మకు ఎప్పుడూ కలగలేదు.

ఒకరోజు అర్జంటుగా అవసరం వచ్చి, వచ్చేనెల జీతంలో అయిదు రూపాయలు ముందేతీసుకుపోవటానికి ఎల్లమ్మ వచ్చింది. అప్పటు మధ్యాన్నం పదకొండయింది. ఆమె పనిలో ప్రవేశించాక ఆ వేళకు ఆ యింటిదగ్గర ఉండటం అదే మొదటిసారి. సుబ్బయ్య భోంచేస్తున్నట్టు గ్రహించి పెరట్లో వేపచెట్టు నీడని నిలబడింది. సుబ్బయ్య కోపంతో మాట్లాడటం ఆమెకు వినపడింది. క్షమించమని సీతమ్మ ప్రతిమాలుతున్నది. భార్య ప్రతిమాలినకొద్దీ సుబ్బయ్య కంఠస్వరంలో కాఠిన్యం హెచ్చుస్థాయిలో ధ్వనిస్తోంది. భార్యని రోజూ యిట్లాగే బాధపెడుతుంటాడు కావాల్నుకుంది ఎల్లమ్మ.

సుబ్బయ్య చెయ్యికడుక్కోటానికి పెరట్లోకి రావటం చూసి ఎల్లమ్మ చెట్టుచాటుకి తప్పుకుంది. అతను చెయ్యి కడుక్కుని వెళ్లిపోగానే ఎందుకో సీతమ్మ పెరట్లోకి వచ్చి ఎల్లమ్మనిచూసి నిర్ఘాంతపోయి అడిగింది.

'ఏమే, నువ్వెప్పుడొచ్చావ్'

'యిప్పుడే నమ్మా'

'ఏదో వుంది సంగతి. లేకపోతే యీ వేళప్పుడు రావు'

'సంగతి కేటుందమ్మా. పిల్లత్తారింటికెల్తా దియ్యాల. ఒక్క అయిదురూపాయలడుక్కోపోదా మనొచ్చా.'

'అయిదురూపాయిలు కాదుగదా అయిదుకాసుకూడా లేవు నా దగ్గర.'

'అలాగంటే ఏలాగమ్మా. బాబుగోర్నడిగయినా యిప్పించండి.'

'ఆయన ఒకటో తారీఖున తప్ప ఒక్క దమ్మిడీ కూడా యివ్వరు. అది ఆయన నియమం.

ఏమాత్రం అవకాశమున్నా డబ్బు ఇవ్వటానికి సీతమ్మ వెనుతీసేమనిషి కాదని ఎల్లమ్మకు తెలుసు. అందువల్ల యింకేమీ అనలేక ఎల్లమ్మ వెళ్లిపోతుంటే వుండమని చెప్పి సీతమ్మ వంటింట్లోకి వెళ్లింది. డబ్బు తీసుకురావటానికి వెళ్లిందని ఎల్లమ్మ ఆశపడింది. కాని సీతమ్మ తీసుకొచ్చింది డబ్బుకాదు. ఒక గిన్నెలో అన్నం, కాస్త వంకాయకూర, కొంచెం బీరకాయపచ్చడీ తీసుకువచ్చి ఎల్లమ్మముందు పెట్టింది. సాధారణంగా ఆ యింట్లో వంటగిన్నెలు కాళీగా పడతాయి. సీతమ్మ యిప్పుడు అన్నం యివ్వటం చూసి—

'మీరు గాని యీ పొద్దు అన్నం తిన్లేదేటి?' అని అడిగింది.

'తినకేం, కడుపునిండా తిన్నాను. కొంచెం మిగిలిపోయింది తీసుకెళ్లు' సీతమ్మ అబద్ధమాడింది. నిజంగా ఆమె తిన్నది తిట్లు కాని అన్నం కాదు.

'అమ్మా ఓసంగతడుగుతాను కసర్రు కదా?' గిన్నె తీసుకుంటూ ఎల్లమ్మ అడిగింది.

'ఏమిటే అదీ?'

'ఈయాల బాబుగోరు మీ మీద మండిపడ్డ్రను. రోజూ అంతేనమ్మా ఆ బాబు?'

'నీ ముఖం రోజూ అల్లా ఎందుకుంటారే? ఈవాళ ఆయన వొంట్లో బాగుండక కొంచెం చిరాకు పడ్డారు.

ఎల్లమ్మకు ఆ జవాబు తృప్తికరంగా లేదు.

'ఈ యమ్మ బాధలు ఎల్లబుచ్చుకునే రకం కాదు' అనుకుంది వెళ్లిపోతూ.

మర్నాడు ఎల్లమ్మ పని ముగించుకుని యింటికి పోబోతుంటే సీతమ్మ పిల్చి చెప్పింది—

'ఈవాళ నాకు చాలా పనుంది. మధ్యాన్నందాకా యిక్కడేవుండి భోంచేసి వెళ్ళు'

'ఎవరన్నా చుట్టాలొత్తారా అమ్మా?"

'చుట్టాలు కాదే ఈవాళ బాబుగారి పుట్టినరోజు. నువ్వు బజారుకివెళ్లి సరుకులు తేవలసి వుంటుంది'

సుబ్బయ్య పుట్టినరోజుకు చాలా ప్రాముఖ్యం యిస్తాడు. పుట్టినరోజునాడు యిష్టమైన పదార్థాలతో తృప్తికరంగా భోంచేసి ఆనందంగా కాలం గడిపితే ఆయుర్వృద్ధి అని అతడికి గట్టినమ్మకం. పెళ్ళయాక యిప్పటివరకూ ముప్ఫైతొమ్మిది సార్లు తన జన్మదినోత్సవం అత్యంత ఆనందదాయకంగా జరిపించుకున్నాడు. అతడికి యిష్టమైన పిండివంటలు సీతమ్మకు బాగా

తెలుసు. అవన్నీ తప్పనిసరిగా అతడి పుట్టినరోజునాడు చేసేది. ఆమె అదృష్టం వల్లనో లేక దురదృష్టంవల్లనో సీతమ్మ పుట్టినరోజుకూడా భర్త పుట్టిన రోజునాడే తటస్థపడుతుంది. అయినా భర్త పొందిన ఆనందంవల్ల కలిగిన సంతోషం తప్ప సీతమ్మకు ఆ రోజంటే ప్రత్యేకమైన అర్థం ఏమీ లేదు. భార్య పుట్టినరోజూ, తను పుట్టినరోజూ ఒకనాడే అని సుబ్బయ్యకు కూడా తెలుసు. కాని ఎప్పుడూ 'నా పుట్టినరోజు' అంటాడే కాని మన పుట్టిన రోజని మాట వరసకైనా అనడు.

తన డబ్భైఅయిదో పుట్టినరోజు వుదయం అమితోత్సాహంతో ఆరుమైళ్ళు నడిచాడు సుబ్బయ్య, మామూలు రెండు మైళ్ళకు బదులు. ఎక్కువ నడిస్తే తనకు ప్రత్యేకం తయారు చెయ్యబడే పిండివంటలను ఎక్కువగా తినొచ్చని అతడి నమ్మకమై ఉంటుంది. సీతమ్మమాత్రం ఆరోజు ఒక విధమైన మానసిక సంక్షోభానికి గురయింది. నలభైఏళ్ళు! నిజంగా తన వైవాహిక జీవితం అంత దీర్ఘమైనదా? అయితే తను నలభై ఏళ్ళనించి జీవితాన్ని మెల్ల మెల్లగా త్యాగం చేస్తూవుందన్న మాట; నలభైఏళ్ళనించి మెల్లమెల్లగా ముసల్దయిపోయింది; నలభై ఏళ్ళనించి సౌఖ్యం కోసం కేవలం ఎగురుచూపటంతోనే గడిపింది; నలభైఏళ్ళనించి అప్పుడప్పుడు తిరుగుబాటు తలపులు కలగటం, వాటిని బలవంతాన అణచిపెట్టటం జరిగింది; నలభైఏళ్ళలోనూ ఆమె కనిన కలలే నిజమైతే ఉద్యోగం చేసే కొడుకు కొకడు, పిల్లల తల్లిఅయిన కూతురొకతె, పెళ్ళి కెదిగిన కూతురు మరొకతె వుండేవారు!

నలభైఏళ్ళ క్రితం సీతమ్మ తన యౌవనాన్ని-తన సర్వస్వాన్ని వివాహమునే తంతు ద్వారా సుబ్బయ్యకు అంకితం చేసింది. అతడు చాలా అందంగా వుండేవాడు; ఆమె అతణ్ని మనస్ఫూర్తిగా ప్రేమించింది; మనస్ఫూర్తిగా నమ్మింది. అతనితోటి తన భావిజీవితం ఆనందమయమనీ ఆశించింది. అయితే ఏం? పెళ్ళిజరిగిన మర్నాడే - సరిగ్గా మర్నాడే - ఆమెకు గొప్ప ఆశాభంగం కలిగింది అతనిలో ప్రవహించే ప్రతి రక్తబిందువూ అతి భయంకరమైన స్వార్థంతో నిండివుందని ఆనాడే ఆమె గ్రహించింది. నలభైసంవత్సరాల జీవితంలోనూ ఆమెకు అతడి సౌఖ్యంలో వాటాలేకపోగా అతడి కష్టాలభారాన్ని తానే భరించింది మిక్కిలి ఓర్పుతో. అతడి దృష్టిలో బంగాళాదుంప కూరకున్న విలువ ఆమెకు లేదు. సుబ్బయ్యకు సీతమ్మ అంటే యిష్టంలేదు. ఆమె చేసిన పుల్లిపాయపులుసు మాత్రం తగని యిష్టం!—ఈవిధంగా సీతమ్మ తన నలభై సంవత్సరాల వైవాహిక జీవితాన్నీ తన ఏభైఅరో పుట్టినరోజున సింహావలోకనం చేసుకుంది.

సరిగ్గా పదకొండు గంటలకు భోజనపు గదిలో ప్రవేశించాడు సుబ్బయ్య భోజనం మాత్రం సిద్ధంగా లేదు! కోపంతో ముఖం కందగడ్డలా చేసుకుని వంటింట్లో ప్రవేశించాడు. కాని సీతమ్మ కనపడదు.

'సీతా' అని యిల్లు మారుమోగేట్టు అరిచాడు. పెరట్లోంచి ఎల్లమ్మ పరుగెత్తుకు వచ్చింది.

'నువ్వొచ్చావేం! అదెక్కడ చచ్చింది?'

'అచ్చమాంబగోరింటి కెళ్ళిందను.'

సుబ్బయ్య అదరిపడ్డాడు. సీతమ్మ ఎప్పుడూ బయటకుపోయి ఎరగదు. ఇల్లు కదలి ఏ పరిస్థితులలోనూ బయటకు పోరాదని ఆమెను తనే శాసించాడు. ఆ శాసనానికి లోబడి ఆమె నలభైఏళ్లు గడిపింది. ఈనాడు శాసనోల్లంఘన జరిగినందుకు అత



'ఇవాళ ఇదేమిటే? నీకు మతిగాలిపోయిందేమిటి' అన్నాడు సుబ్బయ్యగారు.

నికి కోపంతోపాటు ఆశ్చర్యం కూడా కలిగింది.

'అచ్చమాంబయింటికి బుచ్చమాంబయింటికి పేత్తనాలకుపోతే అన్నం ఎవడొచ్చి వడ్డిస్తాడనుకుంది?' అన్నాడు.

'మీ రీయాల పన్నెండింటికి భోంచేత్తారని చెప్పలేదు'

'పన్నెండింటికా! నా జన్మలో ఎప్పుడూ పన్నెండింటికి భోంచెయ్యలేదు.'

ఆ ఒక్క గంటా ఒక్క యుగంలా వుందాతడికి. ఇటువంటి పరిస్థితి అతడికెన్నడూ కలగలేదు. సీతమ్మ ఎందుకు వెళ్లినట్టు? అందులో యీ రోజున తన పుట్టిన రోజు! పైగా భోజన సమయం పదకొండునించి పన్నెండింటికి ఎందుకు మార్చినట్టు? ఇవన్నీ మనసులో చర్చిస్తూ



పన్నెండు కొట్టేదాకా యిల్లంతా పచారు చేశాడు సుబ్బయ్య. అప్పటికీ సీతమ్మ రాలేదు. పెరటిగుమ్మం దగ్గరకువెళ్లి ఎల్లమ్మనడిగాడు.

'ఏం అదింకా రాలేదు కాదూ?'

'రాటం కూతంత ఆలీశమైనా తమని కంగోరు పడొద్దన్నారు.'

'కూతం లేమిటి, గంటన్నరయితే' అని అంటుండగా నే వీధి గుమ్మంలో పదధ్వని వినిపించింది. సీతమ్మ పిల్లిలా నడిచి వచ్చింది. ఆమె ముఖం కాంతి విహీనంగా వుంది. వీధి మెట్లు నాలుగూ ఎక్కినందువల్ల ఆయాసం కూడా వచ్చింది.

'నీ వుద్దేశ మేమిటో కొంచెం వివరించి సెలవిస్తే వినిసంతోషిస్తాం" కోపానికి ఎగతాళి కూడా కలిపి అడిగాడు సుబ్బయ్య.

"ఉద్దేశాని కేముంది? మీకీ వాళ కొంచెం ఆలస్యంగా అన్నం పెడదామనుకున్నాను. అంతే—రండి వడ్డిస్తాను."

ఆమె ప్రశాంతమైన జవాబు అతడి కోపాన్ని ఇనుమడింపచేసినా, తన ఆయుర్వృద్ధికి భంగం వస్తుందని కాబోలు మాట్లాడకుండా పీటమీద కూర్చున్నాడు. సీతమ్మ వంకాయకూర తీసుకువచ్చి వడ్డించింది.

"ఏమిటిది! ఈ వెధవ కూరంటే నాకసహ్యమన్న సంగతి నీకు తెలీదూ?"

"నాకు చాలా యిష్టం. నేనా కూర తిని చాలా ఏళ్ళయింది."

సుబ్బయ్యకు నోట మాట రాలేదు. పెళ్లాం ముఖంలోకి తీక్షణంగా చూశాడు. ఆమె ముఖమా రోజు చాలా శాంతంగా—గంభీరంగా వుంది.

సీతమ్మ యీసారి బీరకాయ పచ్చడి తీసుకొచ్చి వేసింది.

"ఏమిటీ నాటకం?"

"అవును. నాకా పచ్చడి ఎంతో యిష్టం."

"ఇదుగో యిటు చూడు. ఈవాళ నీకు మతేమయినా పోయిందా? లేక తలకాయ కాని తిరుగుతోందా?— అన్నీ నాకు యిష్టం లేనివే ఏడిశావేం?"

"నాకు యిష్టం కదా అని."

"అయితే యిదంతా కావాలనే చేశావన్నమాట?"

"ఇప్పటికి తెలిసిందా మీకా సంగతి? కావాలనే చేశాను."

సుబ్బయ్య సర్వాంగాలూ కంపించిపోయాయి. మితిమీరిన కోపంతో లేచి చెయ్యెత్తాడు కొట్టటానికి.

"అవును. కావాలనే చేశాను." జంకకుండా మళ్ళీ అంది.

ఆమెలో కొత్తగా రేకెత్తిన ధైర్యానికి బిత్తరపోయి మళ్లీ పీటమీద కూలబడ్డాడు సుబ్బయ్య.

"నీకు పిచ్చెత్తినట్టుంది—ఇకనేనా నా పుట్టినరోజు!" అన్నాడు అంతకంటె యింకేమీ అనలేక.

"అవును. ఇదే మీ పుట్టిన రోజు. నా పుట్టినరోజు కూడా యిదే. నాకు పిచ్చెత్తిందని అనుకోనక్కర్లేదు దీని అర్థం తెలుసుకోవాలనుంటే వినండి చెప్తా. నలభై ఏళ్లు!—ఇదుగో యిల్లా వినండి, నలభై ఏళ్లు మీ వింత కోర్కెలకూ, సరదాలకు దోహదం యిస్తూ, అందులో నాకు అణుమాత్రమైనా ఆనందం లేకపోయినా, మీ ఆనందమే నా ఆనందమని బలవంతాన భ్రమపడి మీ సౌఖ్యానికి తోడ్పడ్డాను. ఇన్నాళ్లూ నేనొక వ్యక్తినని కాని, నాకూ కొన్ని కోర్కెలూ, సరదాలూ వుంటాయని కాని గ్రహించేపాటి యింగిత జ్ఞానం మీలో లేకపోయింది. నలభై ఏళ్ల పాటు మీరు నన్నొక బానిసకన్న అధ్వాన్నంగా చూశారు. ఇన్నాళ్ళకు, ఈరోజున - నా పుట్టిన రోజున - నా యిష్టంవచ్చినవి చేసుకుతిని మీచేతకూడా తినిపిద్దామని బుద్ధిపుట్టింది. నా వంట్లో జవసత్వాలు వుడిగిపోయాయి. బహుశా వచ్చే పుట్టినరోజుకు నేను వుండకపోవచ్చు. కాబట్టి యీరోజన్నా నా

(46-వ పేజీ చూడండి)

## జారుడు దారి

(8-వ పేజీ తరువాయి)

సత్యం సంతోషానికి అంతే లేదు. అంత సంతోషం కలగడానికి శ్రీపతి పరీక్ష పోవడం కూడ ఒక కారణమే. ఇంటరు చదవడానికి కాకినాడపోయేటప్పుడు కొత్త ప్రపంచంలోకి పోతున్నట్లుగా భావించాడు. తను కట్టిన ఊహా సౌధాలను యథార్థ సౌధాలుగా చేయడానికి పునాది రాయి వేశాననుకున్నాడు. తను కలలుగన్న స్వర్గం ఎంతో దూరం లేదనిపించింది ఈ ఉత్సాహంతోనే దీక్షగా చదివాడు. అందుకే యూనివర్సిటీలో మూడవవాడిగా ఫస్టుక్లాసులో ప్యాసయ్యాడు.

"మద్రాసులో మకాం పెట్టి చదవడానికి డబ్బెక్కడనుండి వస్తుంది." అన్న నాన్న మాటలు పదివేల యాటంబాంబులై సత్యం ఊహా సౌధాల్ని నామరూపాలు లేకుండా నేలమట్టం చేసినయ్. ఇంజనీరింగు అంటే పురాణగాథల్లోని కృష్ణుడు మొదలయిన పాత్రల్లాగ నిజంగా ఉందా లేదా అని అనుమానం తోచింది వాడికి.

సత్యం ఇంటరు చదివేటప్పుడు ఏ విద్యార్థితోనైనా పరిచయం కలిగితే, అతను తనకంటె ఎక్కువ చదువుతున్నాడా లేక తక్కువచదువుతున్నాడా అని చూచేవాడు. తనకంటె బాగా చదువుతాడో లేదోనని పరీక్షించడానికి ప్రయత్నించేవాడు. బి. ఏ. చదివే వాళ్ళని చూచి తనకంటె తక్కువ వాళ్ళ క్రిందే పరిగణించేవాడు. వాళ్ళందరూ డింకీలు కొట్టి ప్యాసయిన రకాలనీ, లేకపోతే ఏ యింజనీరింగో చదివేవాళ్ళనీ అనుకొనేవాడు. వాడి ఈ ఊహాలన్నీ బి. ఏ. లో చేరడంతోనే నశించిపోయాయి.

చిన్నప్పుడు శ్రీపతితో సత్యం చాల సన్నిహితంగా ఉండడంవలన శ్రీపతిని ఆధారంగా తీసుకుని తన భావి జీవితం గురించి కలలుగన్నాడు. కలలన్నీ, కలలుగానే ఉండడంవల్లనూ, శ్రీపతి అనుకున్నట్లు పాడయి పోకుండడం మూలాన్నీ శ్రీపతి మీద ఒకవిధమైన ఈర్ష్య పుట్టింది. ఈ అసూయ సత్యం ఇంటరు చదివేటప్పుడే కలిగింది. ఈ అసూయే సత్యం జీవితానికి జారుడు బాటయింది. తనగత జీవితాన్ని గురించి ఆలోచిస్తుంటాడు. ఒక్కసారిగా శ్రీపతిలాగ అయిపోవాలని చూస్తుంటాడు.

సత్యం ఇలా ఇంటరు చదవడానికి కాకినాడ వెళ్లాడు. శ్రీపతి అలా తన మామయ్యకు బట్టల మిల్లులో సహాయం చేయడానికి మద్రాసు వెళ్లాడు. మొదట్లో ఈ సరిగతివిని "స్కూలుఫైనలు ఫేలయిం శ్రీపతి బట్టలమిల్లులో ఏం సహాయం చేస్తాడు, వాడిమొహాం" అని నవ్వుకున్నాడు సత్యం.

సత్యం సెలవలకు ఇంటికి వచ్చేటప్పటికి శ్రీపతి సాధారణంగా ఇంటిదగ్గరుండే వాడే కాడు. మద్రాసులోనే ఉండేవాడు. ఒక వేళ ఎప్పుడైనా ఉన్నా సత్యంతో ఎప్పుడూ సరిగా మాట్లాడలేదు. సత్యం పలుకరిస్తే ఏదో ముభావంగా పలుకరించేవాడు. లేకపోతే లేదు. స్కూలుఫైనలు ఫేలయిన వెధవకే అంత గర్వంఉంటే తనకెంత ఉండాలి? అని సత్యంకూడ పలుకరించడం మానేశాడు. అంతే. శ్రీపతీ మాట్లాడ్డం మానేశాడు. వాళ్లిద్దరూ ఎంత సన్నిహితంగా తిరిగేవారో తలచుకొంటే సత్యానికి అప్పటికే ఒక స్వప్నంలాగుండేది.

ఏదెలాగున్నా బి. ఏ. ప్యాసయితూనే మంచి ఉద్యోగాలు సంపాదించవచ్చనీ, బి. ఏ. అంటే అంత నీచంగాదని అప్పుడప్పుడూ తనతోటి విద్యార్థులనుసే మాటలు సత్యానికి కొంత ఆశను కల్పించాయి. ఆయాశతోనే అతని బుర్రలో ఎన్నో బొమ్మలు పరుగెత్తాయి. బి. ఏ. డిగ్రీలుగల జిల్లా కలెక్టర్లు మొదలయిన పెద్ద ఉద్యోగస్థులున్నారు ఆ బొమ్మల్లో. వాడిని ప్రోత్సహించారు. లేకపోతే వాడసలు బి. ఏ. ప్యాసవ్వడు.

బి. ఏ. ప్యాసయిన ఒక సంవత్సరం వరకూ ఆ ఆశలతోనే ఉన్నాడు. తనకోసం ఒక మంచి ఉద్యోగం ఎదురుచూస్తుందనీ, తన తెలివితేటలు చూచి తనకు ఉద్యోగం ఇస్తారనీ అనుకున్నాడు. ఆ ఉద్దేశంతోనే ఎవరో ఊళ్లోఉన్న షుగర్ ఫ్యాక్టరీలో పనిచేయమంటే వినలేదు. సర్వీసుకమీషన్ పరీక్షకు కూర్చున్నాడు. అన్నిటిలోనూ మార్కులు బాగానే వచ్చాయి. ఇంటర్వ్యూకు తన్నుకున్నారు.

అవేవాడి ఊహాలు ఆకాశాన్నంటిన రోజులు. ఇంటర్వ్యూ ఇచ్చే ఆయన అరవవాడట. "నీ వెక్కడ చదివావు?" "కులమేమిటి?" "ఉద్యోగం చేయడానికి కోరిక ఉందా?" అని మూడేమూడు ప్రశ్నలు వేశాడు. "ఇంటర్వ్యూ అంటే ఇంత తేలికా!" అంటూ బయటకు వచ్చాడు.

అడిగిన ప్రశ్నలనుబట్టి తను సెలెక్టుకాను అని చస్తే అనుకోలేక పోయాడు. వాడు సెలెక్టు కానందుకు చాల మంది, చాల కారణాలు చెప్పారు. "అరవవాడైతే మాత్రం!" అనుకున్నాడు. దానిలోని చిదంబర రహస్యం ఇప్పటికీ అర్థంకాలేదు సత్యానికి. తర్వాత ఏం చేయడానికి తోచలేదు.

సత్యం బి. ఏ. ప్యాసయి రెండు సంవత్సరాలయినా ఉద్యోగం దొరకలేదు. ఉన్న భూమికాస్తా అప్పుల పాలయింది. తనొక్కడే అయితే ఏం చేశేవాడో. తల్లిని పోషించాలి. ఉన్నదంతో పెట్టి చదివించారు. తండ్రి లేమిలోనే పోయాడు. అసలు ఉద్యోగం అన్నది దొరికితేనే చాలు చేద్దామనుకున్నాడు. అప్పటివరకూ చిన్న చిన్న గుమస్తా ఉద్యోగాలు కావలసినన్ని దొరుకుతయ్, కాని పెద్దది సంపాదించాలి అనుకున్నాడు. ఏ ఉద్యోగమైనా సరే చేయాలనుకున్నప్పుడు ఆ ఉద్యోగం కూడ దొరక్కుండా పోయింది. పైగా శ్రీపతి ఆ వూళ్ళోనే ఉన్న ఫ్యాక్టరీలో షేర్లుకొన్నాడనీ, చాలా షేర్లుకొన్నాడనీ తెలిసింది. వాడితో పోల్చుకుని మరీ క్రుంగిపోయాడు. సత్యం తన జీవితంలో ఇంతటి అఘాతాలను చూడవలసి వస్తుందనుకోలేదు.

ఒక్కొక్కసారి సత్యం ఆలోచనలు మరీ చిత్రంగా ఉంటయ్. శ్రీపతి తనకంటె దేనిలో ఎక్కువని షేర్లు కొన్నాడు? ధనవంతుడు. అంతేనా! వాడు చిన్నప్పుడు ఎంత చిద్విలాసంగా తిరిగినా, వాడి భావి జీవితానికి రూపం తీసుకురావడానికి కావలసిన పనిముట్లు వాళ్ళనాన్న సంపాదించాడు. తనకోసం తన తండ్రి ఎందుకు గడించలేదు అంత డబ్బు? అవును తన తండ్రికి వాళ్ళనాన్న పోగుచేసి పెట్టలేదు. అయినా తనకోసం తన తండ్రి గడించాలే. ఎలా గడించగలడు? తను తన కొడుక్కు లక్షలు సంపాదించి ఇవ్వగలడా? సరిగా తినడానికే సంపాదన లేదే! ఇలా తర్కించుకుని తను ఒక కోటీశ్వరుడు కావాలని ప్రతి రోజూ పిచ్చిగా తీర్మానించుకునే వాడు.

ఏదో తెలియని బాధతో, ఆరాటంగా మంచంమీద పడి దొర్లుతున్నాడు సత్యం. అది అతనికి అలవాటే. దైనందిన చర్య అది. ఎప్పుడూ రాత్రి పన్నెండు గంటల ముందు పడుకోడు. పడుకుంటాడు గాని నిద్రపట్టదు. దాంతో ఏదో ఆలోచించి పర్యవసానం తేలక తికమకలు పడుతుంటాడు. ఒక్కొక్కసారి సగం నిద్రలో కూడ లేచి దీర్ఘంగా ఆలోచిస్తాడు.

ఆ వూళ్ళో ఫ్యాక్టరీలో పని చేసే వాళ్ళంతా స్కూలు ఫైనలు ప్యాసయినవాళ్లే కాబట్టి బి. ఏ. ప్యాసయిన తను వెడితే కళ్లకద్దుకుని తీసుకుంటారనుకున్నాడు మొదట. అసలు దానిలో పని చేయడమే నీచమనుకున్నాడు. చివరకు ఆ కంపెనీలో కూడ ఉద్యోగం దొరక్కపోయేసరికి ఇంచుమించు పిచ్చివాడయ్యాడు. ఉద్యోగం, ఉద్యోగం అని కలవరించాడు. తను చేరవలసిన గమ్యస్థానం తెలుసుకోకుండానే దానిని చేరడానికి ప్రయత్నించాడు.

సత్యం బి. ఏ. ప్యాసయిన నాలుగు సంవత్సరాలకే అరవైయ్యేళ్ళ ముసలాడిలా కనపడేవాడు. శ్రీపతిమాత్రం లక్షణంగా ఒక లక్ష కట్నం తీసుకుని పెళ్లి చేసుకున్నాడు. ఇద్దరు కొడుకులు కూడాను. శ్రీపతి తను షేర్లుకొన్న కంపెనీ డైరెక్టర్లలో ఒకడిగా ఎన్నుకోబడ్డాడు. ఈ వార్త సత్యాన్ని మరీ కదిలించింది ముందు చిన్న ఉద్యోగంలో చేరితే తర్వాత పెద్ద ఉద్యోగంలోకి రావచ్చు అనే ఆలోచన రానే లేదు సత్యానికి. తను చూస్తుండగా శ్రీపతి అలా పైకి రావడంతో వాడికి వెర్రెత్తి పోయింది.

ఎవరో సన్నని సలహా అందించారు "శ్రీపతిని ఇప్పుడు కలసికొంటే కంపెనీలో ఉద్యోగం సంపాదించవచ్చు" అని. అప్పటికే సత్యం మానాభిమానాల్ని చంపుకుని అడ్డమైన వాళ్లనూ దేవురించాడు. అయినా శ్రీపతి దగ్గరకు వెళ్ళబుద్ధి కాలేదు. కాని ఇంట్లో మరీ గడ్డుపరిస్థితి ఏర్పడింది. అప్పటివరకూ సహాయం చేసే కొందరు బంధువులు నిష్ఠురత చూపించడం మొదలెట్టారు. అంచేత సత్యం తన వ్యక్తిత్వాన్ని చంపుకుని శ్రీపతి దగ్గరకు వెళ్లాడు. ముప్పై అయిదు రూపాయల జీతంతోనూ, నలభై రూపాయల అలవెన్సుతోనూ గుమస్తాగా ఏర్పాటు చేయబడ్డాడు. ముందు ముందు పైకి వచ్చేటట్లు చూస్తానన్నాడు శ్రీపతి.

ఒక సంవత్సరం పనిచేసినా సత్యం గుమస్తాగానే ఉన్నాడు. అతని కది ఎంతో కాలంలా కనపడింది. తనకంటె తక్కువ చదివిన సుబ్బారావు నెలకు నూటయాభై సంపాదిస్తున్నాడు. ఇంక శ్రీపతి సంగతి చెప్పనక్కర్లేదు. కంపెనీ లక్షలు లాభాలు తీస్తుంది. ఆ అంకెలు చూస్తుంటే ప్రపంచమంతా గిర్రున తిరుగుతున్నట్లుండేది సత్యానికి.

అప్పటివరకూ సత్యం తనొక్కడినే శ్రీపతితో పోల్చుకున్నాడుగాని అదే ఫ్యాక్టరీలో పనిచేసే కూలీలను ఎప్పుడూ శ్రీపతితో పోల్చలేదు. దానిలో పనిచేసే వెయ్యిమంది కూలీలు యూనియన్‌గా ఏర్పడి వాళ్ల కనీసపు కోర్కెలు కోరుతుంటే ఎందుకో ఒకనాడు వాళ్ళను గురించి ఆలోచించాడు. వాళ్ళందరూ తన లాంటివాళ్ళే అనుకున్నాడు. వారికి వారి తండ్రులు ఆస్తి సంపాదించి ఇవ్వలేదు. లేకపోతే వాళ్ళూ కంపెనీలలో షేర్లు కొంటూ మేడల్లో హాయిగా నివసించేవారు. మూడెకరాల భూమి ఖర్చుచేసి తను డెబ్భయ్యయిదు రూపాయలు సంపాదిస్తున్నాడు. వాళ్ళకు ఆ మూడెకరాలూ కూడ లేక కూలిపనిచేస్తూ పూరిళ్ళలో నివసిస్తు

(46-వ పేజీ చూడండి)

# రెండు మహానగరాలు

(15-వ పేజీ తరువాయి)

అదంతా పూర్వం సంగతి—ఎబ్బే కాదుకాదు. అది వేరేసంగతి; దేవదూతలా వున్నావ్ నీవే వరివిటి?'

ఆయన కంఠధ్వని మార్దవ స్థాయికి రావటం గమనించి కుమార్తె తండ్రి పాదాలయందు మోకరిలి ఆయన రెండు అరచేతులూ తీసుకుని హృదయానికి హత్తుకుంది.

'నా పేరేమిటో—నాతల్లి యెవరో—నాతండ్రియెవరో తరవాత చెబుతాను—ఇప్పుడు చెప్పటానికి వీల్లేదు; ఇక్కడ చెప్పటానికి వీల్లేదు. ఇప్పుడు మిమ్మల్ని ఒక్కటే అర్థించుతున్నాను—నన్ను మీ చేతులతో స్పృశించండి; నన్ను దీవించండి—నన్ను నా—నన్ను ముద్దు బెట్టుకోండి!'

ఆవిడ బంగారపుజుట్టు ఆయన తెల్లజుట్టుమీద అలుముకుని ఆయనశిరస్సుమీద స్వాతంత్ర్యం ఉదయించుతున్నట్టు కనిపించుతోంది.

'వింటున్నారా?—వింటున్నారో యేమో—ఒకనాడు మీ చెవులకు మధుర సంగీతాలుగా వినిపించిన కంఠధ్వనిపోలికలు నాకంఠ ధ్వనిలో మీకు వినుపించుతున్నాయో యేమో—వినిపించితే—ఆ తియ్యటికంఠాన్ని తలపుకు తెచ్చుకుని, కళవళించి కన్నీరు విడువండి. నా తలవెంట్రుకల స్పర్శతో స్వాతంత్ర్య సౌఖ్యాలనుభవించుతూన్న యౌవనదశలో మీ గుండెలమీద నిశ్చింతగా నిద్రపోయిన ప్రేమమయి శీర్షం స్ఫురణకువస్తే, కంటతడిబెట్టి కన్నులొత్తుకోండి. మన యింటికి పోదాం రమ్మన్న మాటలో మధుర మయజీవితాన్ని అనుభవించిన ఆనాటి మీగృహాన్ని జ్ఞాపకానికి తెస్తే విలపించి, విలపించి వేడికన్నీరు విడువండి'—

ఆయనశిరస్సును హృదయానికి అలుముకుని పసిబిడ్డను ఉయ్యాలలో ఊపినట్టు ఇటూఅటూ ఊపి లాలించుతోంది.

'మీ వేదనా దినాలు అంతమైపోయినై; ఇంగ్లండుకు వెళ్లిపోదాం; మిమ్మల్ని తీసుకుపోదామని వచ్చాను. మాతృభూమి ఫ్రాన్సు మిమ్మల్ని కిరాతంగా చూసింది. ఈమాటలు వింటుంటే పాడరిపోయిన మీ నిష్ఠురజీవితం తలపుకువచ్చి తల్లడిలుతున్నారా? ఏడుపుముంచుకొస్తే ఏడ్చేసెయ్యండి. నే నెవ్వరో చెబుతాను—జీవించివున్న నాతండ్రి యెవరో చెబుతాను. చనిపోయిన నాతల్లి సంగతి చెబుతాను. నే నిప్పుడు మోకరించివున్నది పూజ్యుడైన నాతండ్రిపాదాల ముందు; తల్లిప్రేమ తండ్రి దుర్భరజీవిత గాథను—నాకు తెలియకుండా తెర మరుగుచేసింది. అమాయకపు అజ్ఞానంలో, కన్నతండ్రి అనుభవించుతున్న కఠోర జీవితాన్ని అవగతంచేసుకు కంటతడి బెట్టలేకపోయిన దౌర్భాగ్యురాలిని—క్షమించు తండ్రీ!—మన్నించు. ఇంతటి క్రూరురాలిని కన్నందుకు విలపించు. ప్రేమమయి నా తల్లిని తలుచుకుని దుఃఖించు—అమ్మయ్యా! ఫరవాలేదు—ఆయన కన్నీరు నా చెక్కిళ్ళమీద దిగజారుతోంది. ఆయన యేడుస్తున్నారు—ముంపులు గడుతున్న శోక తరంగాలు నా హృదయంమీద ప్రతిధ్వనించుతున్నయ్—ఇక ఫరవాలేదు—భగవంతుడా! నీకు కృతజ్ఞురాలిని.'

ఆయన పసిపిల్లడులా కుమార్తెవళ్ళో కూలబడిపోయాడు. సంవత్సరాల తరబడి అన్యాయదౌర్జన్యాల కిరాతం నలిబిలిగా నలిపి శల్యావశిష్టుణ్ని చేసిన బొమికెలపోగు; కరుణామయమైన ఆ దృశ్యాన్ని చూడలేక, దూరంగా నిల్చున్న ఆ యిద్దరు పెద్దమనుషులూ అరచేతుల్లో ముఖాలు కమ్మేసుకున్నారు.

ఆ గది యావత్తూ ప్రశాంత నిశబ్దత ఆవరించింది. తుపాను అనంతరం ప్రశాంతి యేర్పడినట్టు ఆయనలో చెలరేగిన ఆవేశ తరంగాలు ఉపశమించినై; స్తబ్దంగా కళ్లుమూసుకుని కుమార్తె ఒళ్ళో పడుకున్నాడు. ఆ యిద్దరు పెద్దమనుషులు ముందుకువచ్చి కుమార్తెనూ, తండ్రినీ లేవదీయటానికి ప్రయత్నించారు. ఆయన ఒళ్ళోనించి నెమ్మదిగా జారి నేలమీద ఏదో మైకంలో వున్నవాడులా సొమ్మసిలి పడుకున్నాడు. ఆ దీనుణ్ని డొక్కలోకి పొదుపుకుని కుమార్తెకూడా ప్రక్కనే అలుముకు పడుకుంది. తండ్రి చెయ్యి దండ చేతిమీదికి తీసుకుంది. ఆయనమీదికి వంగి తన ముంగురులతో ముఖం కమ్మేసి వెలుగుబాధ లేకుండా కాపాడుతోంది.

లారీ ముక్కుచీదుకుంటూ, తండ్రికుమార్తెల దగ్గరగావచ్చి కూర్చున్నాడు. తల నెమ్మదిగా పైకెత్తి అతని వంకచూసి: 'అలజడి కలగకుండా, ఈ పళంగా వెంటనే యిక్కడినుంచి తీసుకుపోవటానికి యేర్పాట్లు చెయ్యగలిగితే బాగుంటుంది'—

'కాని, ఆలోచించు!—ఆయన ప్రయాణాయాసాన్ని భరించగల స్థితిలో వున్నాడా?'

'ఈ భీభత్సనగరంలో వుంచటంవల్ల కలిగే వ్యధను భరించటంకంటే, ప్రయాణాయాసం యేమంత ఉపద్రవకరం కాదనుకుంటాను.'

'అవు నవును' అన్నాడు, డిఫార్జి. ఆయన యీ ఫ్రాన్సులో వున్నప్పటికంటే యెక్కడున్నా యింతకంటే బాగానే వుంటాడు. గుర్రపుబగ్గీ సిద్ధంచేయించమంటే వెంటనే యేర్పాటు చేయిస్తాను.'

'అది వ్యవహారం—వ్యవహార విషయం చూడాలిసొస్తే అది నాకు వదిలెయ్యండి నేను చూసుకుంటూను' అన్నాడు లారీ, రెప్పపాటులో తనుమామూలు ధోరణి నందుకుని.

'అయితే, దయావుంచి, ఆయనకు నిద్రాభంగం కలగకుండా మీ రిద్దరూ ఇక్కడనుంచి బయటికి వెళ్లిపోండి! ఆయన యెంతో ప్రశాంతంగా పడుకున్నారు. నాకేమైనా ప్రమాదం జరుగుతుందేమోనని మీరు భయపడక్కర్లేదు, ఆయన నన్నేమీ చెయ్యడు. మీకా భయమక్కర్లేదు. తలుపు బయట తాళంవేసి వెడితే వెళ్ళండి ఎవ్వరూ లోపలకువచ్చి ఆయన ప్రశాంతికి భంగం కలిగించకుండా. మీరు మళ్లా తిరిగివచ్చేవరకూ ఆయన్ను నేను జాగ్రత్తగా కాపాడుతూ వుంటాను.'

అలా చెయ్యటం వాళ్ళిద్దరకీ మొదట్లో యిష్టంలేదు. ఇద్దరిలో ఒకరు అక్కడ ఉండిపోతే బాగుంటుందనుకున్నారు. కాని వెంటనే ప్రయాణానికి అన్నియేర్పాట్లూ చెయ్యవలసి వుంది. ఒక్కగుర్రపు బగ్గీ సమకూర్చటేమేగాదు. ప్రయాణానికి కావలసిన ప్యాసుపోర్టులు వగైరా సంపాయించాలి. అప్పటికి ప్రొద్దు ఇంకెంతో లేదుకూడా. అందుచేత యిద్దరూ వెనకాముందూ ఆలోచించకుండా చెరోపనిమీదా బయలుదేరారు.

క్రమంగా చీకటిబడిపోయింది. కుమార్తె తండ్రిప్రక్కనే నిశ్శబ్దంగా కూర్చుని, ఆయన వంకచూస్తోంది. చీకటి మరింత గది యావత్తూ ఆవరించేసింది. కొంతసేపటికి దీపపు కిరణాలు తలుపు సందుల్లోనుంచి లోపలికి చొచ్చుకువచ్చినై

మాన్సియర్ డిఫార్జ్, లారీ, యిద్దరూ కలిసి ప్రయాణానికి కావలసిన యేర్పాట్లన్నీ పూర్తిచేశారు. ప్రయాణానికి కావలసిన దుస్తులు వగైరాలే కాక, రొట్టె, కాఫీ, మాంసం, సారా యివన్నీ లోపలికి తీసుకొచ్చారు. లారీ, చేతులో వున్న లాంతరూ సామానూ, బెంచీమీద పెట్టాడు. ఇద్దరూ చెరోవేపునా సాయం పట్టి ఆయన్ను నేలమీదనుంచి లేవదీసి నిల్చోబెట్టారు.

ఆ సమయంలో ఆయన మనసులో యేవిం జరుగుతుందో యే

విధమైన మానవ విజ్ఞానమూ అవగతం చేసుకోలేదు. వాళ్లు చెప్పిన మాటలన్నీ ఆయనకు తెలిసినాయో లేదో, తనకు స్వేచ్ఛ లభించిందన్న విషయం ఆయనకు అర్థమైందో లేదో మానవమాత్రుడు ఊహించలేడు. ఆయన్ను పలకరించాలని చూశారు. కాని ఆయన వున్న అయోమయస్థితి గమనించి, అలాంటి ప్రయత్నం మంచిదిగాదని విరమించుకున్నారు. ఆయనలో మధ్యమధ్య యేదో చికాకు కనుపించుతోంది; కాని కుమార్తెమాట సవ్వడి విన్నప్పుడల్లా యేదో సంతోషాన్ని అనుభవించుతున్నవాడులా ప్రశాంతంగా కనుపించుతున్నాడు.

ఇతరుల ఉత్తరువులకు లోబడి నడుచుకోవటం అలవాటైన వాడు మోస్తరుగానే, వాళ్లు భోజనం చెయ్యమంటే భోజనం చేశాడు; దుస్తులు వేసుకోమంటే దుస్తులు వేసుకున్నాడు. కుమార్తెవచ్చి చెయ్యిపుచ్చుకుంటే, ఆవిడవెంట మరుమాట లేకుండా బయలుదేరాడు.

మెట్లు దిగుతున్నారు; డిఫార్జి లాంతరు పుచ్చుకుని ముందు దారితీస్తున్నాడు. లారీ అందరికంటే వెనక నడుస్తున్నాడు. మెట్లు సగంవరకూ దిగిన తరవాత మాన్సియర్ మానెట్ తలపైకెత్తి పైకప్పువంకా, గోడలవంకా కలియజూచాడు.

'ఈ ప్రదేశం నీకు జ్ఞాపకముందా నాన్నా! ఇక్కడికి రావటం నీకు తెలుసా.'

'ఆఁ!—ఏవిటీ?'—

'ఇక్కడికి రావటం నీకు తెలుసా.'—

'ఊహూ!—లేదు—ఎప్పుడో—చాలా రోజులైనట్టుంది.'

ఖైదులోనుంచి యీ యింటికి ఆయన్ను తీసుకువచ్చిన సంగతి ఆయనకు తెలియదనే సంగతి వాళ్ళకు అర్థమైపోయింది. 'నూట అయిదు నార్త్ టవర్' అని ఆయన గొణుక్కోవటం కూడా వాళ్లు విన్నారు. ఆయన అలా గోడలవంకా గోపికలవంకా పరకాయించి చూడటం 'నార్త్ టవర్' ఖైదుగోడలు కనుపించకనే. మెట్లు దిగి వాకిట్లోకి అడుగుబెట్టగానే అక్కడ ఖైదు కొట్లముందున్న మోస్తరుగానే, అగడ్తమీదవున్న మడత వంతెన కనుపించుతుందనుకున్నాడు. అలాటి దేవీ కనుపించలేదు. గుఱ్ఱపు బగ్గీ వీధి వాకిట్లో నిల్చునుంది. అదేవిటో అర్థంకాక కుమార్తెచెయ్యి వదిలేసి తల సవరించుకుంటున్నాడు.

ద్వారంముందు మనుషు లెవ్వరూ లేరు. కిటికీలలోనుంచి కూడా యెవ్వరూ తొంగిమాట్టంలేదు. ఎన్నడూ లేని విచిత్రమైన నిశ్శబ్దం. ఆ ప్రాంతంలో కనుపించుతున్నదల్లా ఒకే ఒక వ్యక్తి—మాడమ్ డిఫార్జ్ గుమ్మానికి యాలిగిలబడి నిల్చుని లతలు కుడుతోంది; అక్కడ ఉన్నదన్నమాటేగాని, అక్కడేవి జరుగుతోందో యేవీఁ చూడ్డంలేదు.

ఖైదీ ముందు కోచ్‌లోకి యెక్కికూర్చున్నాడు. కుమార్తె ఆయన ప్రక్కనే పోయి కూర్చుంది. లారీ లోపలికి ఎక్కటానికి మెట్టుమీద అడుగుబెట్టాడు; తను కుడుతున్న చెప్పులూ, చెప్పులు కుట్టేసామానూ తేలేదేమని ఆయన బెంగగా గొణిగేసరికి లారీ వెనక్కు తగ్గాడు. అంతవరకూ ఏవీ చూడనట్టు గుమ్మంలోనిల్చున్న మాడమ్ డిఫార్జ్ 'నేను వెళ్లి తీసుకొస్తాలే!' అంటూ భర్తను కేకబెట్టి లోపలికి పరుగెత్తింది. క్షణంలో తిరిగివచ్చి ఆసామానూ చెప్పులూ కోచ్‌లోకి గిరవాటేసి, మళ్ళా యథాతథంగా గుమ్మంలోకిపోయి, కుట్టుకుంటూ నిల్చుంది.

డిఫార్జ్ కోచ్‌వాలాతోపాటు ముందు సీటుమీదయెక్కి కూర్చుని పోనివ్వమన్నాడు. కోచ్‌వాలా కొరడా విదిలించాడు. మినుకుమినుకుమంటూ పైన ఊగుతున్న వీధి దీపాల క్రిందనుంచి కోచ్ టకటకా వెళ్లిపోతోంది.

ఆ వీధిదీపాలు మంచిమంచి వీధుల్లో ఉజ్వలంగా వెలుగుతున్నయ్. నాసిరకం వీధుల్లో నాసిరకంగా మినుకుమినుమంటున్నయ్. దీపకాంతులతో కళ్లు మిరిమిట్లు గొలుపుతున్న దుకాణాలూ, కాఫీహోటళ్ళూ నాటకశాలలూ గడిచి, కోచ్ నగరద్వారం వేపు వెళ్ళిపోతోంది. గేటుదగ్గరున్న 'గార్డ్ హౌస్' సిపాయిలు లాంతర్లు పుచ్చుకుని కోచ్ దగ్గిరి కొచ్చారు. 'పాసుపోర్టులు చూపించండి!'—అంటూ ఒక పోలీసు అధికారిముందుకొచ్చాడు. డిఫార్జ్ కోచ్ మీదినుంచి దిగి క్రింది కొచ్చాడు. 'నా దగ్గిరున్నయ్ చూపిస్తా నిట్టారండి' అంటూ ఆ పెద్దమనిషిని కొంచెం అవతలికి తీసుకెళ్ళి 'కాయితా లివిగో, ఈయన్నీ, యీ కాయితాలూ నాకు వప్పగింత చేసింది...' చివరిమాట బిగ్గిరిగా వినిపించకుండా గొంతు తగ్గించి చెవిలో చెప్పాడు. పోలీసులాంతర్లు కొంతసేపు గుజగుజలాడుకున్నయ్. కొంతసేపటికి లాంతరు పుచ్చుకున్న ఒక యూనిఫారం చెయ్యి కోచ్‌లోకి తొంగి చూసింది. ఆ చెయ్యితాలూకు కళ్లు మామూలు మోస్తరుగా కాక అదోవిధంగా కోచ్‌లోవున్న ముగ్గుబుట్ట తలవంక చూసినై.

'ఆల్ రైట్!—పో!' అంటూ కేకబెట్టింది ఆచేతితాలుకు పోలీసుగొంతు. డిఫార్జ్ ఆ యూనిఫారంకు సలాం కొట్టాడు. అంత కంతకు ఒకటికంటే ఒకటి కాంతిహీనంగా కనుపించుతూన్న దీపాల క్రిందనుంచి గడిచి కోచ్ నక్షత్రాల క్రిందికి వచ్చేస్తోంది.

అనంతదీపాల నీలిచాందినీ పైన కనుపించుతోంది. ఆ నక్షత్రాలలో కొన్ని, ఈ బ్రహ్మాండంలో అణురూపంగావున్న ఈ భూగోళానికి శత సహస్రార్బుద యోజనాల దూరంలో వున్నాయనీ, వాటి కిరణాలు ఈ కర్మజగత్తువరకూ ప్రసరింతున్నాయో లేదో కూడా మనకు తెలియదని ప్రాజ్ఞు లంటారు. చీకటి క్రీనీడలు విశాలంగానూ, అతి దీర్ఘంగానూ పడుతున్నయ్, భూగర్భంనుంచి త్రవ్వి యెత్తబడిన ఆ వ్యక్తి ప్రక్కనే కూర్చుని. ఆయనలో నశించిపోయిన శక్తు లేవిటో, తిరిగి ప్రజ్వలింప జేయటానికి వీలున్న శక్తులేవిటో, యోజించుతున్న లారీ చెవులో ఆ చీకటి క్రీనీడలు గుసగుసగా చెబుతున్నయ్—అదే పాతభోగట్టా!

'పునర్జన్మ కావాలని వాంఛించుతున్నావా?'—

మళ్లీ అదే పాత సమాధానం:

'తెలీదు'—



సీలుఆన్సరు
మద్రాసు
ప్రీమియర్‌బ్యాంకిలో

బహుమతి రూ 10,000

MURALI CROSS WORDS

మురళి 1,2, కాలమ్స్ వర్డ్స్

GOVT REGD NO 1894

ముగింపుతేది

2-5-52

వరుస 1కి
నాలుగు
అణాలు

మొదటి బహుమతి రూ.7000




ఇతర బహుమతి రూ.3,000

## Closing Date 2-5-52 (సీలు ఆన్సరు మద్రాసు ప్రీమియర్ బ్యాంకిలో)

| | | జవాబులు 1 | 2 |
|---|---|---|---|
| 1 | పోటీదారుల ఆదరాభిమానములు మురళి క్రాసువర్డ్సుకు అమూల్యమైన—— | రక్షణ. | శిక్షణ |
| 2 | మొగపిల్లలకంటె ఆడపిల్లల విషయములో మన పెద్దలు ఎక్కువగా ఇది కలిగివుంటారు | గౌరవము | గారాబము |
| 3 | భార్యను ద్వేషించే వ్యక్తి సామాన్యముగా యిలాంటివాడై యుంటాడు | కుటిలుడు | జారుడు |
| 4 | సంసారజీవనములో సుఖభోగములకు దోహాద మొసంగుతుంది | సంపద | సంతతి |
| 5 | ప్రతిమనిషి దీనిగురించి కొంత శ్రద్ధ వహించితీరాలి | దేహము | దేశము |
| 6 | ఒకనికి ఇది వుంతువరకు వ్యసనపడ నక్కర లేదు | ఆదారము | ఆదాయము |
| 7 | ఇదిలేని స్త్రీలు యితరులచే అంతగా ఆకర్షింపబడరు | సౌశీల్యము | సౌందర్యము |
| 8 | శృతిమించితే ఇది ప్రమాదకరముగా పరిణమిస్తుంది | దూరాలోచన | దురాలోచన |
| 9 | ఇట్టివాని ఆలోచనలు సదా విపరీతముగానుండును | వంటరి | తుంటరి |
| 10 | బీడుభూములను——చేయుటకు దొరతనమువారు వెచ్చించు సొమ్ము వమ్ముకానేరదు | బాగు | సాగు |
| 11 | సంసార——నెరిగి వర్తించు జనులు సాధారణముగా సుఖింతురు | భారము | సారము |
| 12 | ఇది లేనివాడు ఒకొక్కప్పుడు హృదయమును సహితము కోల్పోవుననుట అతిశయోక్తికాదు | గతి | మతి |
| 13 | ఇదివచ్చిన తప్పించుకొనుట దుర్లభము | సిగ్గు | దగ్గు |

మీ జవాబులు ఈ ఇండ్లయందు 1.2 మూలముగాపూర్తి చేయుడు

1
2
3
4
5
6
7
8
9
10
11
12
13

పైనుండి కిందవరుసు జవాబులవరుస 1కి 4 అణాలు మాత్రం రూపాయికి 5 వరుసలు పూర్తిచేయుడు

9 వ పోటీ ఆన్సరు

2 2 1 2 1 1 2 2 2 1 1 1 2

ఈ 11 వ పోటీ ఆన్సరు 7-5-52 తేదీ ఆంధ్ర (వార) పత్రికలో ప్రకటించబడును.

పేరు.............................................................................................................

అడ్రసు..........................................................................................................

P. O. or M. O. No.........Col No.........మొత్తము రూ....... మొత్తం వరుసలు...............................

In entering the Competition I agree to abide by the Competition Rules & Conditions and to accept the Competition Manager's decision as final and legally binding.

**No. 11**

**Address Entries to: MURALI CROSSWORDS, PALMANER. (CHITTOOR DIST)**

# ఇది కథ కాదు

"జీవన్"

మన మిప్పుడు చదువుతున్న మహాత్ముల్లో అనేకులు కటిక దారిద్ర్యం అనుభవించిన వారే! సాధారణంగా వారికే ఎక్కువ తెలివి తేటలు ఉంటయ్. ఇదొక ప్రపంచ ఖ్యాతిగల వైజ్ఞానికురాలి జీవితగాథ! చదవండిక!

అప్పటి కామె పదహారేళ్ల పిల్ల. హైస్కూలు చదువు పూర్తయి పోయింది. కాలేజీలో ప్రవేశించాలని ఆమె కెంతో ఉత్సాహం. అంచేత ఓ రోజున తన అక్కయ్యతో యిలా అంది "అక్కా! డాక్టరీ చదవాలని నీకు చాలా సరదాగా వుంది కదూ! నువ్వు చదువుతూండు. నీకయ్యే ఖర్చులకోసం నే పని చేసి సంపాయిస్తాను."

ఇది విన్న ఆమె అక్కయ్య ఆశ్చర్యపోయింది "మరి నీ చదువో?"

"మరేం ఫర్వాలేదులే! నువ్వు డాక్టరమ్మవైన తర్వాత నేను కాలేజీలో చేర్తా! అప్పుడు నువ్వు సంపాయించి తెద్దువుగాని!"

"నువ్వో చదవకూడదూ?" అందామె అక్క. ఆమె నవ్వి అంది: "నేనే మొదట చదువుతే మరి నువ్వు డాక్టరమ్మ వయేదెప్పుడు? అదీ కాక నా చదువు పూర్తయేసరికి నీ వయస్సు మీరిపోతుంది. ఇప్పుడు నే నింకా చిన్నదాన్నేగా! అయిదారు సంవత్సరాలు వరకూ నౌకరీ చేస్తాను."

అలాగే జరిగింది కూడా. అక్కయ్య పారిస్‌లో డాక్టరీ చదవడం ప్రారంభించింది. చెల్లెలు పోలెండ్‌కు ఉత్తర సరిహద్దుననున్న శీతలప్రాంతంలోని ఓ గ్రామంలో ఒక జమీందారు వద్ద నౌకరీకి కుదిరింది. పిల్లల్ని చదివిస్తూండడం, ఎత్తుకొని ఆడిస్తూండటం. ఒకటేమిటి? పిల్లల సంరక్షణ అంతా ఆమె పని!

ఆమె తన స్వగ్రామం విడిచి మరోవూర్లో ఈ పని చేస్తోందన్నమాట. అంచేత అక్కడ ఆమెకు పుస్తకమనేది దొరకడం కష్టసాధ్యమయ్యేది. అథమం రెండు గడియలు కులాసాగా కబుర్లు చెప్పేందుకైనా స్నేహితు లెవరూ లేరు. ఆమెకు అడుగడుగునా కష్టాలు ఎదురయ్యేవి. అయినా అక్కయ్యకోసం, తన భవిష్యత్తుకోసం సహించేది. జమీందారిస్తూన్న కొద్దిపాటి జీతంలోను అక్కయ్యకి పంపగా మిగిలినదాన్ని తన చదువుకోసం కూడబెట్టేది.

ఈ నౌకరీ చేస్తున్నా ఆమె సంతృప్తి పడలేదు. అతి కష్టంమీద కొన్ని పుస్తకాలు కూడా సంపాదించి తన చదువుకై పునాదులు వేసుకో సాగింది. ఇంకా మిగిలిన సమయాన్ని మురికి కాల్వల ప్రక్క ధూళితో, దుమ్ముతో ఉన్న బీద పిల్లల్ని కలుసుకోవడంలో వినియోగించేది. మిలమిల మెరిసే వారి కన్నులు అందమైన జుత్తు చూసి "పాపం! ఎలాంటివాళ్ల కిలాంటి దశ? వీళ్లుమాత్రం పోలెండ్ దేశపు పిల్లలు కారూ?" అని మనస్సులోనే బాధపడేది.

ఆరోజుల్లో పోలెండు జారు చక్రవర్తి అధీనంలో ఉండేది. పోలెండ్ దేశీయులకు వాళ్ళభాష నేర్చుకోవడానికిగాని, తమ చరిత్ర తెలుసుకోవడానికిగాని ఏమీ అధికారం లేదు. వారంతా నిర్బంధంగా రష్యన్ భాష నేర్చుకోవలసిందే. ఎవరైనా పోలెండ్ దేశస్థుడు తమ చరిత్ర తెలుసుకోవడానికి గాని, ఏదయినా కొత్త విషయం తెలుసుకోడానికిగాని ప్రయత్నిస్తే జారు చక్రవర్తిచే నియమింపబడ్డ అధికారి ఆవ్యక్తిని అరెస్టుచేసేవాడు.

ఈ దౌర్జన్యాన్ని చూసి ఆమె ఏమీ అనలేకపోయేది. ఈ అధికార దుర్వినియోగాన్నెలాగయినా అంతమొందించాలని కంకణం కట్టుకుంది. పేదపిల్లలందరికీ పోలెండు దేశభాష నేర్పడానికై ఒక రహస్య పాఠశాల

స్థాపించింది. తను పని చేస్తున్న జమీందారు కుమార్తె కూడా యీ విషయంలో ఆమెకు తోడ్పడింది. వీరిద్దరూ కలిసి అనేకమంది పిల్లల్ని పోగుచేశారు. అందరూ వీళ్ల ప్రేమ సహృదయత చూసి మురిసిపోయేవారు. రాను రాను పిల్లలే కాక యువతి యువకులు, ముసలివాళ్లు కూడా వచ్చి వాళ్లదగ్గర చదువుకోనారంభించారు.

ఇలా ఆరేళ్లు గడిచినయ్. ఆమె అక్కయ్య డక్టరమ్మ అయింది. ఆవిడ పెళ్లికూడా అయిపోయింది. ఇక తనను రావలసిందిగా ఆమె అక్కయ్య పిలిపించింది. ఆమె ఆశలు ఫలించే రోజులు సమీపించాయని ఎంతో ఉప్పొంగిపోయింది. నాలుగోక్లాసులో (ఆ కాలపు రైళ్లలో 4వ తరగతి పెట్టెలుకూడా వుండేవి) మూడు రోజుల ప్రయాణం చేసి అక్కయ్యని చేరుకుంది.

కొన్నాళ్లు అక్కయ్యతో ఉన్న తరవాత ఊళ్లోని ఒక పాత యింటిలో ఒక గదిని అద్దెకి తీసుకున్నది. తను కూడబెట్టిన డబ్బంతా యూనివర్సిటీలో ప్రవేశించడానికే ఖర్చు పెట్టింది. అక్కయ్య అధారంమీదనే ఆమె యూనివర్సిటీలో ప్రవేశించింది. అంచేత ఆవిడ నెల నెలా నలభై రూపాయలు పంపిస్తూండేది. ఏం సరిపోతాయి!

అయినా ఆమె అధైర్య పడలేదు. చిరిగిన బట్టల్నే కుట్టుకుని కొత్త బట్టల ఖర్చు తగ్గించుకునేది. గడిచిన ఆరు సంవత్సరాల్లోనూ కొత్తబట్టమాటే యెరగ దామె. తరచు ఆమె లైబ్రరీలో కూచుని చదువుకుంటుండేది. లైబ్రరీ తెరచి ఉన్నంతసేపూ అక్కడేవుండి చదివేది. లైబ్రరీ కట్టైయ్యాగానే యింటికి వచ్చి దీపం వెలిగించేది. ఈవిధంగా మిగల్చగలిగినంత వరకు దీపంచమురు మిగులుస్తూండే దామె. తిండివిషయంలో కూడా అలాగే వ్యవహరించేది. ఏవయినా పళ్లు కొనుక్కుంటే రెండు రోజులవరకూ సరిపెట్టుకునేది. ఒక డబల్‌రొట్టి కొన్నట్టయితే నాలుగు రోజులు మరి కొనడం మానేసేది. చలికాలం అపరిమితంగా చలివేస్తున్నా తన యింట్లో ఒక్కనాడు కుంపటితో అగ్గి పెట్టుకున్న పాపాన పోలేదు. ఎందుకంటే ఆ రోజుల్లో బొగ్గు ఖరీదు అధికంగా ఉండేది. బొగ్గుకాని మరేదయినా వస్తువుకాని కొంటే సిగ్గువిడిచి తనే యింటికి మోసుకొచ్చుకొనేది. బొగ్గు కొంటే డబ్బు ఖర్చయిపోతుందనీ, అందరి యెదుట బస్తా మోస్తూ తెచ్చి శ్రమపడాలని ఆమె వంట వండుకొనడ మంటే అసహ్యించుకొనేది. వంట అక్కరలేని పళ్లు, రొట్టె ముదలైన వాటితోనే కాలం వెళ్లబుచ్చేది. అదీకాక వండుకోవాలంటే అగ్గి వెయ్యడం, దగ్గిర కూచోవడం, పాత్రలను తోముతూండడం ఇవన్నీ చెయ్యవలసి వస్తూండేది. ఈపనులు చేస్తూ కూచుంటే చదువుకోడానికి టైమేదీ?

ఇలా రోజు రోజూ ఉపవాసం ఉంటూంటే ఎన్నాళ్ళని నిలవగలుగుతుంది! క్రమేపీ ఆమె చిక్కిపోయింది. రెండుసార్లు యూనివర్సిటీలోనే మూర్ఛపోయింది.

(39-వ పేజీ చూడండి)

# హకల్‌బెరీ ఫిన్

## మార్క్ ట్వేన్

### బొమ్మరిల్లు సీరియల్

జిమ్‌ను లేపాను. నేను ప్రాణాలతో మళ్ళీ కనిపించటం అతనికి ఆశ్చర్యం కలగ జేస్తుందనుకున్నాను. కాని జిమ్ ఆశ్చర్యపడనే లేదు. నేను రావటంవల్ల సంతోషం కలిగిందని మాత్రమే అన్నాడు. ఆ రాత్రి అతడుకూడా నా వెనకాలే ఈదుకొంటూ వచ్చాడట. నేను తనను కేకలు వెయ్యటం విన్నాడట కాని సమాధాన మివ్వలేదట. ఎందుకంటే ఎవరన్నా వింటే తనను మళ్లీ బానిస బ్రతుకులోకి లాక్కెడతారని భయపడ్డాడట. ఇంకా ఇలా అన్నాడు:

"ఆ పెద్దబోటు మన పడవను గుద్దుకొన్నప్పుడు నాకు కొద్ది కొద్దిగా దెబ్బలు తగిలాయి. గట్టిగా యీదలేక పోయాను. అందుచేత మీకు బాగా వెనకపడ్డాను. మీరు ఒడ్డు ఎక్కాక మిమ్మల్ని కలుసుకోవచ్చు గదా అనుకున్నాను. కాని మీరు ముందు వెళ్లిపోతున్నారు. నేను మీ వెనక కుంటుతూ వచ్చాను. ఆఇల్లు చూడగానే ఆగిపోయాను. మీరు ఇంట్లోకి వెళ్లటం, మళ్ళీ బయటికి రాకపోవటం చూసి నేను అడవిలోకి వెళ్లి ఆ రాత్రంతా అక్కడే పడుకున్నాను. మర్నాడు కొందరు నీగ్రోలు పొలాలకు వెడుతూ నన్ను చూశారు. నాకు ఈచోటు చూపించి ఇక్కడే ఉండమన్నారు. వాళ్లు రోజూ భోజనం తెచ్చి పెడుతూ, మీరు ఆఇంట్లో ఎలా ఉంటున్నారో కబురు అందచేస్తున్నారు."

"ఇంతకు ముందే నన్నిక్కడికి తీసుకు రమ్మని నీగ్రోలతో ఎందుకు చెప్పలేదు ?"

"మీరువచ్చి ఏం చేస్తారు ? మనం మనదారిని పోవటానికి వీలు చిక్కేవరకూ మీరు ఆ ఇంట్లోను, నేను ఈ అడవిలోనూ ఉండటమే మంచిదని అనుకున్నాను. ఈలోగా నేను వీలు దొరికినప్పుడల్లా పడవను కొంత కొంత మరమ్మతు చేస్తున్నాను—"

"ఏ పడవ ?"

"మన పడవే నండి."

"మన పడవ ముక్కలు ముక్కలై పోలేదూ?"

"లేదు. బాగా దెబ్బతిన్నది గాని పూర్తిగా విరిగిపోలేదు."

"అసలు మనపడవ మళ్ళీ ఎక్కడ దొరికింది?"

"ఆ నీగ్రోలే దాన్ని చూశారు మొదట. చూసి ఒకచోట ఎవరికీ కనిపించకుండా దాచారు. తరవాత ఆపడవ తమలో ఎవరు తీసుకోవాలీ అని వాళ్లలోవాళ్లు కీచులాట సాగించారు. నేను ఆపడవ హక్‌ఫిన్ గారిదీ, నాదీ నని చెప్పి వాళ్ల తగాదా ఆపు చేయించాను. వాళ్ళకి తలొక పదిసెంట్లు లంచం కూడా ఇచ్చాను. అప్పటినుంచి ఆ నీగ్రోలకి నేనంటే ఎక్కడలేని భక్తి మొదలైంది. రోజూ ఒక కొత్త పడవ కనిపిస్తే రోజూ డబ్బొస్తుంది గదా అని కూడా ఆశపడ్డారు. నేనేది చెప్పినా ఎగిరి గంతేసి సంతోషంతో చేసేస్తున్నారు. నిజానికి వాళ్లు బలే మంచి వాళ్లు. మిమ్మల్నిక్కడికి తీసుకొచ్చిన నీగ్రో ఉన్నాడే —వాడు అందరికంటే మంచివాడు."

"అవును. అంతేకాదు; మంచి తెలివి తేటలు గలవాడు కూడా. నువ్విక్కడున్నావని వాడు నాతో చెప్పనేలేదు. ఇక్కడేవో మంచి పళ్లున్నాయి, చూపిస్తాను రమ్మన్నాడు. ఒకవేళ మనసంగతి బయట పడితే తన మీదికేమీ రాకుండా చేసుకోటానికే అలా అని వుంటాడు. ఎవరన్నా వాణ్ని అడిగితే నిన్నూ నన్నూ ఒకచోట ఉండగా ఎప్పుడూ చూడలేదంటాడు. నిజంకూడా అదేగా?"

ఆ మర్నాడు చీకటితోనే మెలుకువ వచ్చింది. ఇంకా బాగా తెల్లవారలేదు గదా అని మళ్ళీ పడుకుందామనుకున్నాను. ఇంతలో ఎందుకో ఇల్లంతా నిశ్శబ్దంగా ఉన్నట్టు అనిపించింది. మామూలుగా ఆవేళకి ఇల్లు సందడిగా ఉంటుంది ఆశ్చర్యపడుతూ లేచాను. బక్ కూడా అప్పటికే లేచి ఎక్కడికో పోయాడు. కిందకి వెళ్లాను. ఎవ్వరూ లేరు. ఇంటి బయట కూడా ఎవ్వరూ లేరు. అంతా నిశ్శబ్దంగా వుంది. కొంత సేపటికి నా నీగ్రో నౌకరు జాక్ కనిపించాడు. ఎవరూ లేరేమని వాణ్ణడిగాను.

"మీ కింకా తెలియదా జార్జిగారూ?"

"ఉహు. ఏమి జరిగింది?"

"ఏం లేదండి. మనమిస్ సోఫియా గారు ఒక రాత్రివేళ పారి పోయారండి. ఎప్పుడు పారిపోయిందో ఎవరూ చూడలేదు. అరగంట కిందగావును ఆవిడ ఇంట్లో లేనట్టు కనిపెట్టారు బహుశా హార్నే షెపర్డ్ సన్ ఉన్నాడు చూడండి—ఆయనతో పారిపోయినట్టు అనుమాన పడ్డారు. వెంటనే తుపాకులు పట్టుకుని, గుర్రాలెక్కి వాళ్లని పట్టుకోటానికి పోయారు. మొగ వాళ్లందరూ హార్నే, సోఫియాల వెంట పరుగెత్తారు. ఆడవాళ్లు తమ బంధువులతో చెప్పటానికి వాళ్లిళ్లకి వెళ్లారు ఏం జరిగిందో ఇంకా తెలియదండి."

"బక్ కూడా నన్ను లేపకుండా వెళ్లాడే?"

"అవునండి. మిమ్మల్ని ఈ పోట్లాటలో ఇరికించ కూడదని మిమ్మల్ని వదిలేసి వెళ్లారు బక్ గారు తన తుపాకి తీసుకుని వెళ్లారు. కనీసం ఒక్క షెపర్డ్ సన్ నైనా చంపటమో, లేక తనే చచ్చిపోవటమో చేస్తానని వెళ్లారు."

నది పక్కరోడ్డు వెంబడే కాలి కొద్దీ పరిగెత్తాను. కొంత దూరం పోయేసరికి తుపాకుల మోత వినిపించింది. కొంత దూరంలో పడవల రేవు దగ్గరగా కర్రల అడితి కనబడింది. నేను చెట్లచాటున, పొదల మధ్య పాకుతూపోయి ఒక గుబురు చెట్టెక్కి కూర్చున్నాను. నే నెక్కిన చెట్టు ఎదురుగా కొన్ని గజాల దూరంలో చెక్కలతో కట్టిన గోడ ఉంది. దాని వెనక దాక్కుందామనుకున్నాను గాని మళ్ళీ ఎందుకులే అని మానివేశాను.

కర్రల అడితి ఎదురుగా నలుగు రైదురుగురు మనుషులు గుర్రాలెక్కి అరుస్తూ, గోలచేస్తూ అడితి గోడ వెనక దాక్కున్న ఇద్దరు మనుషులను పేల్చటానికి ప్రయత్నిస్తున్నారు. కాని గోడచాటు నున్న మనుషులు గుర్రాలమీద ఉన్నవారికి అందటం లేదు. కొంత సేపటికి గుర్రాలమీద ఉన్నవారు అడితి లోపలికి ప్రవేశించారు. వెంటనే గోడచాటున ఉన్న వాళ్లలో ఒకడు తుపాకి గురిపెట్టి ఒకణ్ణి పడగొట్టాడు. మిగతా వాళ్లు గభాలున గుర్రాలు దిగి పడిపోయిన మనిషిని అడితి లోపలికి చేర్చటానికి వెళ్లారు. ఈ లోగానే గోడచాటు నున్నవారు వెనక్కి పరుగెత్తుకొనివచ్చి నే నెక్కిన చెట్టు ఎదురుగావున్న చెక్కల గోడ చాటుకు చేరారు వారిలో ఒకడు నా స్నేహితుడు బక్. మరొకడు సుమారు పందొమ్మిదేళ్ల యువకుడు.

గుర్రాలెక్కిన మనుషులు బక్ కోసం, అతని బంధువు కోసం అంతా వెదికారు. వాళ్లు కనిపించక కాస్సేపు అక్కడే తచ్చాడి వెనక్కి పోయారు. వాళ్లు వెళ్లిపోగానే నేను బక్ ని మెల్లిగా కేకవేసి పిలిచాను. అతడు హడలిపోయి వెనక్కి తిరిగి చెట్టుమీద వున్న నన్ను చూశాడు. శత్రువులు కనుచూపు మేర దూరంలో కనిపిస్తే ముందుగా తన్ను హెచ్చరించమన్నాడు. తరవాత ఏడవటం మొదలు పెట్టాడు. అవ్వాళ జరిగిన పోట్లాటలో తనతండ్రి, ఇద్దరు అన్నలు కూడా చచ్చి పోయారని, శత్రువులలో ఇద్దరు ముగ్గురు చచ్చిపోయారనీ, తన తండ్రి బంధువుల సహాయం వచ్చేవరకూ ఆగకుండా షెపర్డ్ సన్ ల మీదికి దూకాడని, శత్రువులు ఎక్కువమంది ఉండటం వల్ల తన వాళ్లను చంపేశారని ఏడుస్తూ చెప్పాడు. నేను "మిస్ సోఫియా, హార్నే ఏమయ్యా"రని అడిగాను. వాళ్లు నదిదాటి వెళ్ళిపోయారని చెప్పాడు బక్. వాళ్లయినా

షేమంగా ఉన్నందుకు నేను సంతోషించాను. కాని హార్నేను చంపలేక పోయినందుకు బక్ విచార పడటం చూస్తే నాకు చిరాకు కలిగింది.

ఇంతలో హఠాత్తుగా ఢాం! ఢాం! ఢాం! అని మూడుసార్లు తుపాకులు పేలాయి! వెనకనుంచి బక్, అతని బంధువు ఇద్దరూ గాయపడి నదివైపు పరిగెత్త సాగారు. నాకు భయంతో మూర్ఛ వచ్చేటంత పని అయింది. "చంపడి! చంపండి!" అని కేకలు వినిపించాయి. బక్ వెంటపడి శత్రువులు తరుముతున్నారు. తరవాత ఏమి జరిగిందో నేను మాటలతో చెప్పలేను. నేను అసలు ఆరాత్రి గ్రేంజర్ ఫర్డుల ఇంటికి వెళ్ళకనేపోతే ఆదారుణ దృశ్యాన్ని కళ్లారా చూడవలసి వచ్చేదికాదు గదా అనుకున్నాను.

చీకటి పడేవరకూ నేను చెట్టుదిగలేదు. దిగటానికి భయం వేసింది అప్పుడప్పుడు అడవుల్లోంచి తుపాకి మోతలు వినిపిస్తున్నాయి. రెండు సార్లుగావును కొందరు మనుషులు గుర్రాలెక్కి అడితి మీదుగా పోవటం చూశాను. వారి చేతుల్లో తుపాకులున్నాయి. ఇంకా పోట్లాట కాలేదన్నమాట. గ్రేంజర్ ఫర్డుల ఇంటికి ఈ సమయంలో పోవటం అపాయమనుకున్నాను. అంతేగాక అవాళ జరిగిన వినాశనానికి కూడా నేనే కారణమని ఆందోళన పడ్డాను. కిందటిరోజు నేను మిస్ సోఫియా కిచ్చిన చీటీ మూలానే ఇదంతా జరిగింది. "రెండున్నరకి" అని ఆ చీటీమీద రాసివున్న దానికి అర్థం బహుశా మిస్ సోఫియా హార్నే షె.ర్డ్సన్‌ను రెండున్నరకి ఎక్కడో కలుసుకోవలసిందనే అయివుంటుంది. ఆ చీటీని మిస్ సోఫియా కివ్వకుండా ఆమె తండ్రికే యిచ్చివుంటే ఆయన కుమార్తె పారిపోకుండా ఏదో జాగ్రత్త తిసుకునే వాడు.

చీకటి పడ్డాక చెట్టుదిగి నదిఒడ్డున కొంత దూరం నడిచాను ఒకచోట రెండు శవాలు కనిపించాయి. ఒకటి బక్‌ది, రెండోది అతని బంధువుది. బక్ శవం చూడగానే నాకు ఏడుపు వచ్చింది. అతడు నన్ను సోదరుడి మాదిరిగా ఆదరించాడు పాపం.

గ్రేంజర్ ఫర్డుల ఇంటికి పోకుండా అడవుల్లో పడి జిమ్ దాక్కున్న రహస్య స్థలానికి వెళ్లాను. జిమ్ అక్కడ లేడు. మాపడవ దాచబడిన చోట ఉంటాడేమోనని అక్కడికి వెళ్ళాను. అక్కడ కూడా జిమ్ లేడు; పడవకూడా కనిపించలేదు. ఏదో జరిగిందని భయపడ్డాను. "జిమ్!" అని కేకవేశాను. పదిగజాల దూరంలోనుండి జిమ్ గొంతుక వినిపించింది

"మీ రేనా హాక్‌గారూ! నెమ్మదిగా మాట్లాడండి అరవకండి."

జిమ్ మాపడవలో కూర్చుని ఉన్నాడు. పడవను సమీపించి నేను కూడా ఎక్కాను.

"ఏమిటండీ హాక్‌గారూ! ప్రతిసారీ మీరు నన్ను హడలగొడుతున్నారు. ఇందాక పోట్లాటలో మీరు చచ్చిపోయారనే అనుకున్నారు. మీ నీగ్రో నౌకరు జాక్ వచ్చి మీరు ఇంటికి తిరిగి రాలేదనీ, చచ్చిపోయి ఉంటారనీ చెప్పాడు. నేనిక బయల్దేరి పోదామనుకుంటుంటే ఇంతలో మీరొచ్చారు. బతే వారండి మీరు!"

"పద పద; యీ దరిద్రపు దేశంనుంచి దబ్బున బయట పడదాం. నేను పోట్లాటలో చచ్చిపోయి వుంటానని ఇంట్లోవాళ్లు అనుకుంటారు. ఇక నాకోసం వాళ్లు వెదికించరు. అదీ ఒకందుకు మంచిదే. పద పోదాం."

మాపడవ రెండుమైళ్లు దిగువకుపోయి మిసిసిపీ నదిమధ్యకు వచ్చిందాకా నామనస్సు స్థిమిత పడలేదు. అర్థంలేని వైరాలతో నిండిన ఆ ప్రదేశం విడిచిపెట్టినందుకు ఎంతైనా సంతోషం కలిగింది. అంతేగాక మళ్ళీ మా స్వంత పడవలో ఎవరి అదుపాజ్ఞలు లేకుండా స్వతంత్రంగా సంచరించటం కూడా హాయి అనిపించింది. ఇల్లు అనగానే బోలెడంత ఇరకాటం, కామాటం, జంజాటం వుంటాయి. కాని పడవ సంగతి వేరు. ప్రపంచంలో పడవకంటే సుఖమైనచోటు ఇంకోటి లేదు స్వేచ్ఛగా, విశాలంగా, ఎవడిష్టం వచ్చినట్టు వాడు ఉండవచ్చు.

## 19

రెండు మూడు రాత్రులు వరసగా మిసిసిపీ దిగువకు ప్రయాణం చేశాము. కాలం హాయిగా, కులాసాగా గడిచిపోయేది అక్కడ నది అతి విశాలంగా ఉంది కొన్నిచోట్ల మైలున్నర దాకా వెడల్పు ఉండేది. రాత్రిళ్లు ప్రయాణం చెయ్యటం, తెల్లవారే

సూచనలు కనిపించగానే ఏ చిన్న లంకమీదనో లేక ఒడ్డున అడవుల్లోనో మకాం చేసేవాళ్లం. చెట్లకొమ్మలు ఆకులు తెచ్చి మా పడవను కప్పేవాళ్లం. చేపల వలవేసి చేపలు పట్టేవాళ్లం. తరవాత నదిలో దూకి కొంత సేపు ఈతలు కొట్టేవాళ్లం. ఒడ్డున కూర్చుని సూర్యుడు ఉదయించటం చూస్తూ గడిపే వాళ్లం. మొదట నది అవతల ఒడ్డున నల్లటి పొడుగాటి గీత కనిపించేది. అవి ఒడ్డునవున్న చెట్లు. తరవాత ఆగీత నెత్తిమీద కొద్దిగా తెల్లబడేది. ఆ తెలుపు క్రమంగా ఆకాశంలోకి పాకేది. నది క్రమంగా నలుపు తగ్గి బూడిద రంగుగా కనిపించేది. దూరంగా నదిలో నల్లటి చుక్కలు కనిపించేవి. తెల్లవారుతున్న కొద్దీ ఆచుక్కలు పడవలుగా మారేవి. అంతా నిశ్శబ్దంగా ఉండి, ఎప్పుడో కప్పల బెక బెకలు మాత్రం వినిపించేది. క్రమంగా చల్లటి గాలి వీచేది. ఎంత అలసటగా ఉన్నా ఆగాలి వీచేటప్పటికి ప్రాణం తేలిపోయేది. ఇంతలో సూర్యుడు ఉదయించే వాడు. ప్రపంచమంతా సూర్యకాంతిలో నవ్వుతున్నట్టుండేది. పక్షులు కలకలమని రొద చెయ్యటం ప్రారంభించేవి.

వలలో పడిన చేపలు తీసి చెట్లమధ్యకు పోయి వండుకునే వాళ్లం. వేడివేడిగా భోజనం చేశాక, చుట్టలు ముట్టించి చెట్లకింద పడుకుని నదివంకే చూస్తూ మత్తుగా గడిపే వాళ్లం. అలాగే పడి నిద్రపోయి, ఎప్పుడో లేచేవాళ్ళం. మమ్మల్ని లేపింది ఏమిటా అని చూస్తే నది మధ్యలో పెద్ద శబ్దం చేస్తూ ఏదో పొగబోటు ప్రయాణం చేస్తూండేది. అది పోయిన తరవాత మళ్లీ గంటదాకా చీమకూడా చిటుకుమనేది కాదు. పగలంతా అలాగే ఒంటరి ప్రపంచంలో నిశ్శబ్దాన్నే వింటూ గడిపే వాళ్ళం.

చీకటిపడిన తర్వాత భోజనాలు చేసి మళ్ళీ ప్రయాణమయ్యే వాళ్లం. నదిమధ్యకు వెళ్లగానే పడవను దానిష్టం వచ్చినట్లు పోనిచ్చే వాళ్ళం. మేము ఆరుబయట ఆకాశం కింద పడుకుని కబుర్లు చెప్పుకునే వాళ్లం. రాత్రులు ఒక్కొక్కసారి మాకు ఏ పడవా, పొగబోటు తగిలేదే కాదు. నది అంతా మా సొంతం లాగా వాడుకునే వాళ్లం. నిజంగా పడవ జీవిత మంత సుఖం ఇంకోటి లేదు. నక్షత్రాలు గుంపులు గుంపులుగా ప్రకాశించేవి. ఒక్కొక్క సారి నేనూ, జిమ్ వాదించుకునే వాళ్లం. నక్షత్రాలని ఎవరో తయారుచేసి వుంటారని జిమ్ అనేవాడు. "కాదు, వాటంతటవే పుట్టా" యని నేననేవాణ్ణి. ఎందుకంటే అన్ని నక్షత్రాల్ని తయారు చెయ్యటానికి ఎన్నివేల ఏళ్లో పడుతుంది ; కనక వాటంతటవే వచ్చివుంటాయి. జిమ్ కొంతసేపు ఆలోచించి చంద్రుడు గుడ్లు పెడితే అవే నక్షత్రా లయ్యాయని అనేవాడు. కప్పలు వందలు వందలు గుడ్లు పెట్టడం చూసి వున్నాను గనక నేను జిమ్ చెప్పిన దానికి ఒప్పుకునే వాణ్ణి. అప్పుడప్పుడు నక్షత్రాలు రాలేవి. అవి చెడిపోయిన గుడ్లని, వాటిని గూట్లోంచి కిందకి తోసేస్తున్నారనీ జిమ్ అనేవాడు.

ఒకరాత్రి మాకు ఒక చక్కని డింగీ దొరికింది. దాన్ని పట్టుకుని మా పడవకు కట్టివేశాము. తెల్లవారవచ్చేవేళ నేను డింగీలో ఎక్కి ఒడ్డుకు వెళ్లాను— తింటానికి మంచి పళ్లేమైనా దొరుకుతాయేమో తెద్దామని. ఒడ్డున అటూ ఇటూ తిరుగుతూ వుండగా ఇద్దరు మనుషులు కాళ్లు తొక్కుకుంటూ, హడావుడిగా నాకేసి పరుగెత్తు కొచ్చారు. చచ్చాననుకున్నాను. ఎక్కడ మనుషులు పరుగెత్తుతున్నా నాకోసమో, జిమ్‌కోసమో నని భయపడటం అలవాటైంది. నేను పారిపోవటానికి కూడా సందివ్వకుండా వాళ్లు మీద పడ్డారు. పడి నన్ను గడ్డం పట్టుకుని బతిమాలసాగారు— తమ ప్రాణాలు రక్షించమని. తాము ఏ పాపమూ ఎరగమని, అందుకని ఎవరో తమ్ము తరుముతున్నారని, వెనకాల కుక్కలు కూడా తరుము కొస్తున్నాయని చెప్పారు. నామాట వినిపించుకోకుండా డింగీలోకి ఎక్కబోయారు నేను వాళ్లను ఆపి ఇలా అన్నాను:

"ముందు నేను డింగీని కొంత లోపలికి తీసుకుపోయి ఆపుతాను మీరు నీళ్లలో నడిచివచ్చి డింగీ ఎక్కండి. అలా చేస్తే కుక్కలు మీ అడుగులు పసికట్టలేవు."

వాళ్లు ఒప్పుకున్నారు. వాళ్లు డింగీ ఎక్కాక నేను జిమ్ మా పడవను ఆపివుంచిన లంకకు డింగీని తీసుకు పోయాను. లంకను సమీపిస్తుండగా ఒడ్డున కుక్కలను వెంట పెట్టుకుని కొందరు మనుషులు పరు

(48-వ పేజీ చూడండి)

# గడియారం చెప్పిన కథ



(గతసంచిక తరువాయి)

సుందరం గడియారం చెప్తు తున్న ఆత్మకథను అలక్ష్యంగానైనా వింటూనే వున్నాడు. వింటూ వుండగానే చివరకు యీ గడియారం కూడా యిలా తనను మాటలలో బోల్తా కొట్టిస్తోందేమో అనిపించి, ఆతనికి తల కొట్టి వేసినంత చిన్నతనం తోచింది. అయినా అప్పటికే అయిందీ-ఈ గడియారం ఎన్ని డచ్చీలు కొట్టిందీ తన దగ్గర గొప్ప చెప్పకో గలుగుతుందీ! సమయం కనిపెట్టి పల్టీ కొట్టించ వచ్చులెమ్మనుకొని తానే తమాయించుకొన్నాడు.

గడియారం సుందరంకేసి అదో రకమైన పెద్దరికపు చూపు చూస్తూ వస్తున్న చిరునవ్వును తన రెండు ముళ్లమధ్య అలానే నొక్కి పట్టుకొంటూ "చిరాకు పడకోయ్ సుందరం! గడియారాలు వున్నా లేకపోయినా, వీటిని వుపయోగించే మనుష్యులువున్నా వుండకపోయినా కాలమేమో నిలచిపోదు. కాకపోతే మనుష్యులంటూ వున్నారు కాబట్టి వాళ్లకు కాలంతో ప్రయోజనం వున్నది కాబట్టి గడియారాలు కావలసి వచ్చాయని మాత్రం గుర్తుంచుకో. అది సరే కానీ - మీ స్కూలు యిక్కడకు ఎంత దూరం వున్నది?"

"ఏం? అరమైలు వుంటుంది."

"అరమైలు అని ఎలా చెప్పగలుగుతున్నావ్?"

"అదేమిటి అరమైలు దూరం వుంటే అరమైలు అని చెప్పటానికేం!"

"నేను అడిగింది అది కాదు— మైలు, అరమైలు, ఫర్లాంగు, గజం యీ లెక్కలన్ని ఎలా వచ్చాయీ అని"

"దానికే ముందీ-కొలిస్తే తెలుస్తుంది."

"కొలవటం అంటే దేనితోనో ఒక దానితో కొలవాలి దాక? దూరం కొలిచేందుకు ఏదో ఒక ప్రమాణం వున్నది కనుక నువ్వు తేలికగా మీ స్కూలు అరమైలు దూరం వున్నదని చెప్పగలిగావు. అలాగే కాలాన్ని కొలవటానికి కూడా ఏదో ఒకటి కావాలి."

"కాలాన్ని కొలవటం ఏమిటి?"

"అవును కాలాన్ని పూర్వ కాలంలో కొలిచిన రోజులున్నాయి." సుందరం ఫక్కున నవ్వాడు.

"నాతలకాయ. ఇంకా నయం! కాలాన్ని కిరసనాలు మాదిరిగా గరాటాలో పోసి కొలిచారని చెప్పావు కాదు!"

"ఆగవోయ్ సుందరం ఆగూ! మీ మనుష్యులు కాలాన్ని గరాటాల్లో పోసీ కొలిచారు; కర్రతోనూ కొలిసారు. చెప్తాను వస్తున్నాగా తొందర పడకు."

నవ్వుతూ నవ్వుతూ వున్న సుందరం నవ్వు ఆపేసి ఆశ్చర్యంగా కళ్లు పెద్దవి చేసి గడియారం చెప్పే మాటలు శ్రద్ధగా వినటానికి తయారు అయ్యాడు.

"చాలా పూర్వం పాశ్చాత్య దేశాలలో క్రైస్తవ మత బోధకులలో బ్రదర్ అగస్టిన్ అనే సన్యాసి ఒకాయన వుండేవాడు. ఆయన కాలాల్ని పుస్తకంతోనే కొలిచేవాడు. ఎలాగంటావేమో-చెపుతా విను. ప్రతిరోజూ అర్ధరాత్రి గడిచాక మూడు గంటల తరువాత

(34-వ పేజీ చూడండి)




ఆ చిన్న ఉద్యానవనంలో జిలిబిలి దారులవెంట వెళ్లి ఆలిస్ ఒకచోట ఆగిపోయింది అక్కడ అరకు రాణీగారి ఆజ్ఞలను కళావరు, డైమను, ఇస్పేటు, అరకు సైన్యాలకు బాకాతో తెల్లకుందేలు అందిస్తోంది అప్పుడే రాణీగారి వినోదంకోసం ఒక ఆట సాగుతోంది బాట్‌కి బదులు కొంగమెడతో, బంతుల్లాగా ఉడతల్ని కొడుతున్నారు రాణీగారి ఆట గెలవకపోతే సైనికుల్ని 'పీక తీసెయ్యి' అని ఆజ్ఞలిస్తారు గెలిస్తే వారి సంతోషాన్ని భరించడం సైనికులికి మరీ కష్టం ఆలిస్‌ని చూచి ఆటలోకి రమ్మంది రాణీగారు ఆలిస్ ఓ కొంగమెడ పుచ్చుకుంది ఇంతలోకే రాణీ గారికి కనపడకుండా ఆమెవెనక చెషైర్ పిల్లి ప్రత్యక్షమయింది "రాణీగారితో ఆటలో చేరావే! బాగుందా ఆట" అంది చెషైర్ పిల్లి "ఛ ఇదేం ఆట! రాణీకి అసలు బుద్ధిలేదు అస్తమానూ చిర్రుబుర్రులాడుతుంది మాట్లాడితే వాడిపీక తీసెయ్యి వీడిపీక తీసెయ్యి అంటుంది ఇదేం రాణీ బాబూ పేకరాణీ" అంది ఆలిస్ అనేసిన తరవాత రాణీగారు తన మాటలు వింటోందని జ్ఞాపకం వచ్చింది నాలుక్కొరుక్కుంది "ఆ! నన్ను పేకరాణీ అంటావా? నా మీద కుట్ర పన్నడానికొచ్చినట్టున్నావు" అంటూ మండిపడింది రాణీగారు 'అవ్వ, అవ్వ!' అంటూ నోరు నొక్కుకుంది తెల్లకుందేలు. పట్టుకో అని పెద్ద కేక పెట్టింది రాణీగారు పేకముక్కంత ఉన్న ఆలిస్‌ని పేకసైన్యాలు పట్టుకుని నిర్బంధించాయి

రాణీగారి ఆజ్ఞలు తెల్లకుందేలు బాకాతో అందిస్తోంది

రాణీగారి వెనక ప్రత్యక్షమయింది చెషైర్ పిల్లి.

*   *   *

పేకముక్కంతే ఉన్న ఆలిస్‌ని పేకసైన్యాలు పట్టుకుని నిర్బంధించాయి.



# గడియారం చెప్పినకథ

(31-వ పేజీ తరువాయి)

క్రైస్తవ సన్యాసు లంతా కలిసి ప్రార్థనలు చేసేవారు. ప్రార్థనా సమయం మిగిలిన వారందరికీ తెలిపే బాధ్యత బ్రదర్ అగస్టిన్‌ది. నిద్రపోతుండే సన్యాసుల నందరినీ యీయన గంటకొట్టి నిద్ర లేపే వాడు. సరిగా ఏ వేళప్పుడు గంట కొట్టాలో యితడికి మాత్రం ఎలా తెలుస్తుందీ ? మరి అప్పుడు గడియారాలు లేవుగా! అందుకని ఈయన ఒక పద్ధతి కని పెట్టాడు. రోజూ ప్రొద్దు గూకగానే క్రైస్తవ ప్రార్థన గీతాలు వుండే పుస్తకం ముందు వేసుకొని కూర్చొని ఆవకుండా చదువు కొంటూ పోయే వాడు. అలా పుస్తకం మొదటి పేజీనుంచీ మొదలు పెట్టి చదువుకొంటూ పోతే ఫలాని పేజీ దగ్గరకు వచ్చేసరికి అర్థరాత్రి దాటి అనుకొన్న విధంగా మూడు గంటలూ గడిచి పోతుందని ఒక గుర్తు పెట్టుకొన్నాడు. ప్రతిరోజూ విడవకుండా సూర్యాస్తమయం నుంచీ చదువు ప్రారంభించి ఆగుర్తు పెటుకొన్న పేజీకి వచ్చేవరకు ఆగకుండా చదివే వాడు. ఆపేజీకి వచ్చాక పుస్తకం మూసివేసి గబగబాపోయి గంటస్తంభం ఎక్కి గంట వాయించేవాడు. మిగిలిన క్రైస్తవ సన్యాసులు యీ గంట వినగానే నిద్దుర లేచి కాలకృత్యాలు తీర్చుకొని ప్రార్థనలకు సమావేశమయ్యారు. ఈ విధంగా కొద్ది రోజులు జరిగాక ఆ ప్రక్కగావున్న గ్రామ ప్రజలకు కూడా బ్రదర్ అగస్టిన్ వాయించే గంటే గుర్తు అయింది. ఈగంట వినిపించగానే అందరూ నిద్దర్లు లేచి ఎవరి పనికి వాళ్ళు పూనుకొనేవారు. ఈలా కొంతకాలం జరిగాక ఒకసారి భలే విచిత్రమైన సంఘటన ఒకటి జరిగింది. ఆరోజు బ్రదర్ అగస్టిన్ కొంచెంజాస్తిగా భోజనమే చేశాడో, లేక మరొకచుక్క ద్రాక్షరసం అధికంగా సేవించాడో ఏమో— ఆ రాత్రి పుస్తకం చదువుతూ చదువుతూనే కునుకుతీశాడు. ఈతడు గంటకొట్టకుండానే తెల్లవారిపోయింది. అంతవరకూ యీయన కొట్టిన గంటలువిని నిద్రలేవటానికి అలవాటుపడ్డ ఆ గ్రామస్థులంతా ఆరోజుజరిగిన విపరీతానికి ఎంతో ఆందోళనపడ్డారు. బ్రదర్ అగస్టిన్ గంటకొట్టకముందే సూర్యుడు తొందరపడి వుదయించాడని వీరు అనుకొన్నారే కాని, సూర్యుడు తనుచేసేపనిలో ఎన్నడూ లోపం చెయ్యడనీ, ఆరోజు జరిగిన లోపం అంతా బ్రదర్ అగస్టిన్ దేననీ ఆ గ్రామస్థులకు తోచనేలేదు. ఈ వుదంతంఅంతా చెప్పుతుంటే నాకు యీ యింట్లోనే విన్నమరొక కథ జ్ఞాపకానికివస్తున్నది."

"ఊఁ! చెప్పు చెప్పు! భలే మంచి కథలే చెప్పుతావే నువ్వు! నేను ఏమిటో అనుకున్నా!" అన్నాడు సుందరం.

"ఇంకా మంచికథ లున్నాయి. చెప్పతా కానీ, మరినువ్వు నా సావాసం వుంటావా ?"

"నీతోనా సావాసం!... కానీలే ముందు కథచెప్పు. ఆనక్కి చూద్దాం."

"చెప్పనా!... అనగా అనగా ఒకవూళ్లో ఒకముసలమ్మ వుండేదట.

ఆ ముసలమ్మకు దిక్కూ మొక్కూ ఎవ్వరూ లేరట. ఆమెకు వున్న ఆస్తి ఏమిటో తెలుసా ? ఒక కుంపటి; ఒక కోడిపుంజు. ప్రతిరోజూ తెల్లవారుఝామున యీ కోడికూత విని ఆ గ్రామంలో వుండే వారంతా నిద్దుర లేచి, యీ ముసలమ్మ దగ్గరకు వచ్చి ఆ కుంపట్లో వుండే కాసిని పండు బొగ్గులు అడిగి పట్టుకువెళ్ళి ఎవరింటో వాళ్లు పొయ్యి రాజేసుకొని వంటలు వండుకొనే వారు. ఇలా కొన్నేళ్లుకడిచాక ఒకరోజున యీ ముసలమ్మకు గర్వంపుట్టుకొచ్చి యింతమందీ బ్రతుకుతున్నారంటే తనవల్ల నేకదా అనుకొన్నదిట. తన కోడి కూయకపోతే తెల్లవారదనీ, తనకుంపటిలో బొగ్గులు అరువు యీయకపోతే యింతమందికీ నిప్పు దొరకక వంటలు లేక మలమలమాడి చస్తారనీ నమ్మేసింది.''

''వెర్రి మొఖం''

''అవును వెర్రిమొఖమే ! అంతటితో ఆగిందా ఆ వెర్రిమొఖం ;



"ఏమయ్యోవ్! మా బిల్లులు విడి విడిగా వెయ్"

ఒకరోజు అర్ధరాత్రి ఆ కోడినీ కుంపటినీ తీసుకొని ఎక్కడికో అడవిలోకి చక్కాపోయింది.

"తరువాత ఏమైనా అయిందా?"

''అయ్యేందుకు ఏమున్నదీ? ఆ గ్రామంలో మామూలుగానే తెల్లవారింది. అలవాటుప్రకారం ముసలమ్మగుడిసెకు నిప్పుకోసం కొందరు వచ్చారు. ఆవిడ అక్కడ లేకపోయే సరికి ఎక్కడికిపోయిందోలే అనుకొని ఎవరియిళ్ళకు వాళ్ళువెళ్ళి తమ యింట్లో తామే నిప్పు రాజేసుకొన్నారు. వంటలు వండుకొన్నారు విందులు ఆరగించారు. ఇక్కడ యీ అడవిలో ముసలమ్మ మాత్రం తనూ తన కోడీ లేకపోతే ఆ గ్రామం అంతా నాశనమైపోతుందని చంకలు కొట్టుకొంటూ, ఆ అడవిలో తినటానికి ఏమీ దొరకక వుపవాసాలు వున్నది."

"కథ బాగానే వున్నది కానీ— మీ గడియారాలు కూడా ఆ ముసలమ్మ మాదిరిగా "మేం లేకపోతే రైళ్లు గుద్దుకుంటాయి, లెక్కల మాష్టారు ఆపకుండా లెక్కలు చెప్పుకుపోతూనే వుంటాడు" అని గనక ఎప్పుడైనా అనుకొన్నారా, ఆ ముసలమ్మకు పట్టిన గతేమీకూ పట్టుతుంది. తప్పదు. ముమ్మాటికీ తప్పదు." అన్నాడు సుందరం. అమ్మయ్య ! ఇప్పటికి గడియారాలకి బుద్ధి వచ్చేటట్లు అంటించాను కదా అని లోలోపల నే పొంగి పోయాడు.

"తమ్ముడూ ! మేం లేకపోతే మీరంతా ఏదో అయిపోతారేమో అనే దిగులు మాకు ఎన్నడూ లేదు. మేము లేకపోతే మీకు గడవదు కనుకనే మమ్మల్ని కొని తెచ్చుకొన్నారు."

"కాయ్-నారాజా !"

"కోతలు కావు: వినూ సాంతం విను."

(ఇంకావుంది)

# ★ మిస్ - ఫ్లారెన్స్ నైటింగేల్ ★

చెల్లాయీ! ఈమధ్య మా మిత్రుడు ఒకడు కారుక్రిందపడ్డాడు. కాలువిరిగింది. ఆ ప్రమాదం జరిగే సమయాన నేనూ ఆతనితోపాటే నడచివెళ్లుతున్నాను. ఇంతలో ప్రక్క సందులోనుంచీ బ్రేకులు వెయ్యకుండానే ఒకకారు మాంఛీ స్పీడుగావచ్చింది. నేనుమాత్రం ఎలాగో తప్పుకొన్నాను. నా మిత్రుడుపాపం పరాకుగావుండి ఆ కారుచక్రంక్రింద పడిపోయాడు. వెంటనే హాస్పిటల్ ఎంబ్యులెన్స్ కారువచ్చి యితనిని ఎక్కించుకొని ఆస్పత్రికి చేరవేసింది. ఆ సంఘటన చూచినవాణ్ణి అవటంచేత నన్నుకూడా అదే ఎంబ్యులెన్సులో హాస్పటల్‌కు తీసుకువెళ్లారు. అక్కడ కారు ఆగీ ఆగటంతోటే నలుగురు నర్సులు స్ట్రెచ్చర్ పట్టుకువచ్చారు. మిత్రుణ్ణి ఎక్కించి లోపలకు తీసుకువెళ్లారు. రక్తం వోడుతున్న ఆతని కాలునంతా శుభ్రం చేయ నారంభించారు. అక్కడవున్న నర్సులందరిలోకి చిన్ననర్సు ఒకామె యీరక్తాన్నీ, వికృత ఆకారాన్ని చూచి తానే మూర్ఛపోయింది. ఆమెను అవతలకు తీసుకొనివెళ్లి మరొక జట్టు నర్సులు కొన్నిశైత్యోపచారాలు చేశారు. ఆ హాస్పిటల్, ఆ రోగుల దైన్యం, ఆ నర్సులు వారికి చేస్తున్నసేవ యిదంతా చూస్తున్నంతసేపూ నా మనస్సులో 'ఫ్లారెన్స్ నైటింగేల్' పేరు మెదులుతునేవున్నది. అప్పటినుంచీ నీకు ఆమె జీవిత విశేషాలనుగురించి వ్రాద్దామని వుబలాటపడుతున్నాను. కానీ తీరికదొరకక యింత వరకూ జాప్యం జరిగింది.

1850 వ సంవత్సరంలో ఇంగ్లాండుదేశంలో చరిత్రకు ఎక్కని గొప్ప విప్లవం ఒకటిజరిగింది. స్థితిమంతుల కుటుంబంలో పుట్టి, తగినంత విద్యనభ్యసించి, చెప్పుకోదగిన అందంవున్న ఫ్లారెన్స్ నైటింగేల్ అనే ఒక కన్య దీనమానవసేవకు తన జీవితాన్ని అంకితంచేసుకొన్నది. ఈ ఒక్కవ్యక్తి తన జీవితాన్ని అలా అంకితం చేసుకొన్నంతమాత్రంచేత అది విప్లవం ఎలా ఔతుందనే అనుమానం నీలోకలిగితే కలుగవచ్చు. నీకీవిషయం పూర్తిగా అర్థంకావాలంటే అప్పటి ఆస్పత్రుల పరిస్థితిని కొంత వర్ణించాలి.

అవి ఆస్పత్రులనటంకంటే కసాయిశాలలనటం నయమేమో! రోగులు పడుకొనే పరుపులపై బట్టలుమార్చటం అసలు ఎన్నడూ జరిగేదికాదు. చిన్నచిన్న యిళ్లు ఆస్పత్రులుగావుండేవి. రోగులు ఎక్కువైనకొద్దీ గదులలోనూ, గుమ్మాలలోనూ, వరాండాలలోనూ ఎక్కడపడితే అక్కడ నల్లులు చీమలు పడివున్నట్లుగా రోగులు వుండేవారు. వీరికి పరిచర్య చేయటానికోసం దాదులంటూవుండేవారు. వీరికి యిచ్చే జీతం మామూలుగా కూలీలకు యిచ్చేదానికంటే హీనంగావుండేది. ఆ కారణంచేత యోగ్యతకలవారు ఎవ్వరూ యీపనికివచ్చేవారుకాదు. కులంలేనిమనుషులు నీతినియమం లేని అలగా జనం యీ పనులలో చేరేవారు. వీళ్లు ఎన్ని అపభ్రంశపు పనులుచెయ్యాలో అన్నీ చేస్తూవుండేవారు. తప్పతాగి తందనాలాడేవారు. రోగులను వీళ్లు పశువుల్లా చూసేవారు. రోగులు కూడా వీరిపట్ల అలాగే ప్రవర్తించేవారు. ఇలాటి దుర్భరవిషయాలన్నీ ఫ్లారెన్స్ నైటింగేల్ తాను కండ్లతో చూచి, వీటిని ఎలాగైనా సరే తొలగించాలని పట్టుదల పట్టింది. పట్టుదలైతే కావలసినంతవున్నది కానీ అది ఆచరణలోకి తేవటం ఎలా? అందులోనూ కలవారి యింటి ఆడపడుచు! ఆ వర్గానికిచెందిన ఆడువారు ఆస్పత్రుల వంటికూపాలలో ప్రవేశించి బీదా, బిక్కి, ముసలి ముదుక రోగుల మలినాన్ని ముట్టుకోవటమే! అది తలుచుకొంటేనే మిగిలినవారందరికీ వాంతివచ్చినంత పనిఅయ్యేది. కానీ ఫ్లారెన్ నైటింగేల్‌కు మాత్రం అలాటిపనికి పూనుకొని మానవసేవచేసే మహద్భాగ్యం తనకేనాటికైనా లభిస్తుందా అనే నిరాశ మనసులో పొడచూపేది. ఇటువంటి పనికి ససేమిరా ఒప్పుకోని ఆమెతల్లిదండ్రులు, ఎరిగినవారెవరో నిదే

శాలలో పర్యటనకు పోతుంటే, వారితోపాటు యీమెనుకూడా పంపించారు. ఆ యా దేశాలు చూడటం అక్కడి విశేషాలు తెలుసుకోవటం వీటిమూలంగా తమ కుమార్తె ఆ ధ్యాస మానుతుంది కదా అని వీళ్లు ఆశపడ్డారు. సరిగ్గా దానికి వ్యతిరేకం జరిగింది. ఈమె తానుపోయిన ప్రతిచోటా ఆస్పత్రులకుపోయి, అక్కడి రోగుల పరిస్థితిచూచి, అక్కడి దాదులు ఎలా నడుచుకొంటారో వారి విధులు ఏమిటో, వారుపొందే తర్ఫీదుఎలాటిదో తెలుసుకొనేది. కైజర్‌వర్త్ అనేచోట క్రైస్తవ మిషనరీలు నర్సులకు ట్రైనింగ్ యిస్తుంటే తానూ అందులోచేరి శిక్షణపొందింది శిక్షణపొంది స్వదేశానికి తిరిగివచ్చాక అక్కడ కొందరు డబ్బువున్న స్త్రీలు పాషన్ కోసం స్థాపించిన ఒక సంఘంలో పనికత్తెగాచేరింది. ఈ సంఘం వ్యాధి గ్రస్తులైనవారికి సహాయం చేయటంకోసం ఏర్పడింది. జీతం బత్తెంలేని యీ నౌకరీకి ఒప్పుకొని ఫ్లారెన్స్ నైటింగేల్ ఆ సంస్థను ఏదో ఆషామాషీ సంస్థగా కాక నిజమైన సేవచేసే సంస్థగా వెలయించింది. ఈమె పగలనక రాత్రనక, నిష్పక్షపాతంగా చేసిన సేవకు, ఆమెచేత సేవచేయించుకొన్న ప్రతిరోగీ ఆమెను ఒక దేవతగా భావించి పూజించసాగారు. ఈమెసేవానిరతి ప్రభుత్వాధికారులదాకా పాకింది.

ఆ సమయంలో ఇంగ్లిషు సైన్యాలు క్రిమియాఅనేచోట యుద్ధంచేస్తున్నాయి. బ్రిటిష్ మంత్రులు తమ సైన్యాలు అవలీలగా అక్కడ విజయం సాధించగలవని భావించారు. అంతతేలికగానే విజయం సాధించగలిగేవారేమోకానీ – అక్కడకుపోయినకొద్ది రోజులలోనే సైనికులలో చాలామందికి కలరావంటివ్యాధులు సోకాయి. యుద్ధభూమికి సమీపంలోవున్న 'స్కుటారీ' అనేచోట ఒక్కవైద్యశాలవున్నది. అక్కడ మందులుకూడా చాలినన్నిలేవు. యుద్ధంలో గాయపడినవారికి కట్టుకట్టటానికైనా గుడ్డముక్కలేక ఎక్కడికక్కడ మనుష్యులు కుళ్లుతుండగా, కలరావ్యాధికూడా వుధృతంగావచ్చింది. ఇక ఆ ఆస్పత్రిలో రోగులు ఎక్కువైపోయి, మన మూడవతరగతి రైలుపెట్టెలో ప్రయాణీకులు ఎంతగా క్రిక్కిరిసివుంటారో, అక్కడా ఆరోగులు అంతకిక్కిరిసివున్నారు. వారికి మంచా, మాకు ఏమీలేకపోగా వారు విడిచిన మలంమాత్రం అక్కడనుంచీ దూరంగా తీసుకుపోయి పారబోయడానికికానీ — చచ్చిన రోగులను అవతలకు యీడ్చిపారవెయ్యటానికి కానీ ఎవరూ పూనుకోలేదు.



ఈ అసహ్యాకరమైన పరిస్థితిని గురించి 'లండన్ టైమ్స్' పత్రిక విలేఖరి అక్కడకు వెళ్లి చూచి, పత్రికలో ప్రకటించాడు. దానితో ప్రభుత్వం కళ్లు తెరచి మిస్ ఫ్లారెన్స్ నైటింగేల్‌ను పిలిపించి ఆమె చేతికి కొంత డబ్బును 40 మంది నర్సులను యిచ్చి క్రిమియాకు పంపించింది. మర్యాదస్తుల కుటుంబంలో పుట్టిన కన్య యీవిధంగా యుద్ధంలో దెబ్బతిన్నవారికి పరిచర్య చేయబోవటానికి యిదే ప్రథమం.

ఈమె అక్కడకు రావటం 'స్కుటారీ'లోని స్థానికాధికారులకు ఏమంత యిష్టంగాలేదు. ఎన్ని విధాల ఆమెను ఏడ్పించాలో అన్ని విధాలా ఏడ్పించారు. అయినా సరే - ఆమె తనకు వ్యక్తిగతంగా జరుగుతున్న అవమానాలకు కానీ, తాను శారీరకంగా పడవలసివచ్చిన యిబ్బందులకు కానీ ఎంత మాత్రమూ లెక్కచేయలేదు. ఆమె తనజీవితం వ్యాధిగ్రస్తులై నిస్సహాయ స్థితిలోవున్న వారికి సేవచేయటంలోనే గడుపదలచుకొన్నది. అటువంటి అవకాశం యిప్పుడు కోకొల్లలుగా లభించింది. ఆమె అంతవరకే చూసుకొన్నది. ఒకసారి ఆ వైద్యశాలలో రోగులు విసర్జించిన మలం పీపాలనిండా నింపి, పాకీ వాళ్లు అక్కడేవదలి వెళ్లిపోయారట. ఎన్నిసార్లుచెప్పినా ఎవరూ కల్పించుకొని వాటిని ఖాళీచేయలేదట. అదిచూచి ఆమె 10, 12 గంటలసేపు కదలకుండా వాటిప్రక్కనే దారికి అడ్డంగా అలానే నిలుచున్నది. అప్పటికి ఆ పనివాళ్లకు బుద్ధివచ్చింది. మరొక సందర్భంలో అవతల యుద్ధరంగంలో వ్యాధి ధృతిమించి పడవలతోవచ్చి రోగులు పడ్డారు. సేవచేసేవారికి చేసి పూర్తిచేసేలోగానే పదిమంది రోగులు ఆర్తనాదాలు చేసుకొంటూ అక్కడికివచ్చి పడుతున్నారు. అప్పుడు యీమె ఏకబారుగా 24 గంటలసేపు అలా నిలువుకాళ్ళమీద నిలుచొని పరిచర్యలుచేసింది. మొత్తంమీద కొద్దిరోజులలోగా, అంతకుపూర్వం ఆలనాపాలనా లేక అలమటిస్తున్న రోగులంతా యీమె అలా తమ వద్ద అరనిముషంనిలచినా, తమ వైపు కన్నెత్తిచూచి పెదవి కదలించినా తమతమ బాధలన్నీ చేతితో తొలగించినంతగా తృప్తిపడసాగారు. ఒకానొక రోగి, కదలిపోతున్న నైటింగేల్ నీడకు ప్రణమిల్లానని తన డైరీలో వ్రాసుకొన్నాడు. ఇంత నిర్విరామంగా ఆస్పత్రి పనులుచేస్తూకూడా ఆమె బ్రిటిష్ మంత్రివర్గానికి కొన్ని సూచనలుచేస్తూ పెద్దపెద్ద జాబులు

వ్రాసింది. ఆ జాబులలో నర్సుల కీయవలసిన శిక్షణ, రోగులపోషణ, ఆరోగ్యవిధులనుగూర్చి ఎంతో చక్కని సలహాలుయిచ్చింది. పగలంతా రోగులకు పరిచర్యలుచేసి రాత్రిరాత్రిఅంతా దీపంముందు కూర్చొని లెక్కలువ్రాసేది. మళ్లీ తెల్లవారబోయేలోగా నల్లని గౌను తొడుక్కొని వార్డులన్నిటి చుట్టూ ఒకదీపం పుచ్చుకు తిరిగి ఎవరెవరు ఎలావున్నదీ చూచివచ్చేది. ఆదీపం పట్టుకొని అంతశ్రద్ధగా తిరిగేవ్యక్తి ఆమె తప్పితే మరెవ్వరూ లేకపోయినందువల్ల ఆమెను రోగులందరూ "ది లేడీ విత్ ది లాంప్" అనేవారు. ఇంతాచేసి ఏ వ్యాధితో పోరాడి అందరు సైనికులను మృత్యుముఖంనుండీ ఈమె తప్పించిందో, ఆవ్యాధికి తానే గురి అయింది. ఆమె ఆ వ్యాధినుంచి కోలుకొనేసరికి బ్రిటిష్ ప్రజలంతా ఆవిడచేసిన త్యాగాన్ని గుర్తించి ఆమెను తెగపొగుడుతూ జాబులువ్రాశారు.

ఈనాడు ప్రపంచదేశాలలో రోగం పాలుపడ్డవ్యక్తులు పరాయి వారిచేత యీమాత్రంగానైనా ఆదరించబడుతున్నారంటే,అందుకు కారణం 1850 లో ఫ్లారెన్స్ నైటింగేల్ వంటి వనిత తన జీవితాన్ని మానవసేవకు అంకితం చేసుకొన్నందువల్లనే. మానవులుచేసిన పాపాలన్నిటినీ తనపై వేసుకొని,వారికోసం తాను శిలువనెక్కిన వాడు ఏసుక్రీస్తు. మానవులు వ్యాధి, మృత్యువు మొదలైన వాటివల్ల పడుతున్న బాధలను గుర్తించి, వాటిని తొలగించటానికై ఆరాటపడ్డవాడు బుద్ధభగవానుడు. రోగగ్రస్తులైన సోదర మానవులకు, స్వార్థం వదలుకొని ప్రతిఫలాపేక్ష లేక సేవచేయ పూనుకొన్నది ఫ్లారెన్స్ నైటింగేల్.

ఇలాటివారి జీవిత చరిత్రలన్నీ జ్ఞాపకం తెచ్చుకొన్నప్పుడల్లా మానవుని జీవితానికి ఏదో మహత్తరమైన ప్రయోజనం వున్నదని అనిపిస్తున్నది కదూ!

—వి. ఎన్.

## ఇది కథకాదు

( -వ పేజీ తరువాయి)

అక్కయ్యకి ఈ కబురు తెలియగానే గబగబా వచ్చి ఆమెమీద మండిపడింది. బాగా కొట్టిందికూడ. తనయింటికి తీసుకుపోయిందామెని. అక్కడ ఆమె ఎన్నాళ్లో ఉండక మళ్లీ తన యింటికే వచ్చేసింది.

శీతకాలంలో చలి అధికంగా వున్నా ఒక్కనాడు కూడా తన గదిలో మంట చేసుకో లేదు. ఓరోజున చలి భరించడం కష్టమైపోయింది. పెట్టెతీసి ఉన్న బట్టలన్నీ కప్పేసుకుంది. ఇంకా లాభం లేకపోయేసరికి తను చదువుకునే మేజా, కుర్చీలు, పుస్తకాలు తెచ్చి మీద పడేసుకుంది. ఈవిధంగా చలి రాత్రులను గడిపింది. రకరకాల కష్టాలను భరిస్తూన్నా ప్రఫుల్ల వదనంతో విశ్వవిద్యాలయంలో సైన్సుకు సంబంధించిన పెద్ద పరీక్షకు కూచుంది. పరీక్షా ఫలితాలు వెలువడినయ్. ఇంకేముంది? అందరికంటె మొదట తనపేరే వుంది.

ఆ తరువాత ...! ఆ తరువాత కూడా ఆమె తపస్సు పూర్తి కాలేదు. సైన్సులో యింకా క్రొత్త వింతలు కనిపెట్టాలని ఆమె కోర్కె. ఆమె పెళ్లికూడా అయిపోయింది. ఆమె భర్త తెలివితేటలున్న వైజ్ఞానికుడే! కాని పాపం బీదవాడు. ఆమెకు పాత్రలు తోమడం, వంట వండడం తప్పలేదు. మిగిలిన సమయాన్ని సైన్సు పరిశోధనలకోసమై ఉపయోగించేది. కొత్తవి కనిపెట్టడానికి ఆమెకు ఒక ప్రయోగశాలయినా లేదు. అధమం అందుకు కావాల్సిన పరికరాలైనా లేవు. అయినా ఎంతో శ్రమదమాదుల కోర్చి సాధించింది. ఆఖరికి ఒక రోజున అసంభవాన్ని సంభవంగా మార్చింది. ఆమె "రేడియమ్"ని కనిపెట్టి ప్రపంచ వైజ్ఞానికలోకంలో ఒక గొప్ప కలకలాన్ని బయల్దేరదీసింది. ప్రపంచమంతటా ఆమె పేరు మార్మోగింది. ఈమె కృషి ఫలితంగా రాచపుండువంటి భయంకర వ్యాధులకు ఔషధం యీనాటికి మనకు లభ్యమైంది.

ఆమెయెవరో తెలుసా? ప్రపంచ విఖ్యాతిగల వైజ్ఞానికురాలు—మేడమ్ క్యూరీ. విజ్ఞానంద్వారా లోకసేవ చేసినందుకు ఆమెకు రెండుసార్లు నోబెల్ ప్రైజుకూడా లభించింది. ఏం? మీకు మేడమ్ క్యూరీలా కావాలని లేదూ? ★



రోహిణీవారి కొత్తచిత్రం “వెంజన్స్’ లో గిరిజ.



అంజలీవారి "పరదేశి"లో తారగా నటిస్తున్న వసంత.

# హాలీవుడ్ చిత్రాలు

ప్రస్తుతం మనదేశంలో దేశ భాషా చిత్రాల తర్వాత ఎక్కువగా వ్యాప్తిలో ఉన్నవి హాలీవుడ్ చిత్రాలు ఈ చిత్రాలకున్నంత వ్యాప్తి బ్రిటిష్ చిత్రాలకుగాని, మిగతా ఏ విదేశీ చిత్రాలకుగాని లేదు ఆర్థిక, రాజకీయ రంగాల్లో అమెరికా ప్రభావం వ్యాపించినట్లే సాంస్కృతిక రంగంలోను, చలనచిత్ర రంగంలోను కూడా అమెరికా ప్రభావం చాల దేశాల్లో బలపడుతున్నది బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ మొదలైన దేశాలలో అమెరికన్ చిత్రాల తాకిడికి ఆగలేక జాతీయ సినిమా పరిశ్రమలు దెబ్బ తింటున్నవి మన సినిమా పరిశ్రమ మీద అమెరికన్ చిత్రాలు ఇంతవరకూ ఆర్థికంగా దెబ్బ తియ్యక పోవటానికి కారణం మన భాష, సంస్కృతి భిన్నం కావటమేనని చెప్పాలి

అయినప్పటికీ హాలీవుడ్ చిత్రాల ప్రభావం మన సినిమాల మీద కనిపిస్తూనే వున్నది హాలీవుడ్ కథలను ముక్కకిముక్క అనుకరించటం దగ్గిర్నుంచీ, చిత్ర నిర్మాణ ప్రయోజనం, దృక్పథంవరకూ మన నిర్మాతలు అమెరికానే అనుసరిస్తున్నారు టెక్నికల్ గాను, నిర్మాణంలోను అమెరికన్ చిత్రాలు మనవాటికంటే ఎంతో అభివృద్ధి చెందినప్పటికీ కథలు, కథావస్తువులు ప్రయోజనాలు, దృక్పథాల విషయంలో మనవారూ, అమెరికనులు ఒకే చోట ఉన్నారు

యుద్ధానంతరం అమెరికాలో తయారయ్యే చిత్రాలు కేవలం వినోద ప్రధానమైనవిగానే ఉంటున్నాయి వినోదానికి మితిమీరిన విలువ ఇవ్వటంవల్ల, కథావస్తువు ఎంత అసందర్భమైనదైనా, జీవితానికి ఎంత విరుద్ధమైనదైనా చెలామణీ అయిపోతున్నది దైనిక జీవితంలో ఏ ఆశా, ఉత్సాహం, జీవితలక్ష్యమూ లేని ప్రజా సామాన్యానికి కృత్రిమంగా ఉద్రేకమూ, ఉల్లాసమూ కలిగించే హత్యలు, దోపిడీలు, కాముకలాపాలు మొదలైన కథావస్తువులతో తయారైన చిత్రాలు చూపబడుతున్నవి.

ఈ విధమైన వినోదం గల చిత్రాలు కేవలం వ్యాపార దృష్టితోనే తీయబడుతున్నవని అమెరికాలో చిత్రనిర్మాతలు, చిత్ర విమర్శకులు కూడా అంగీకరిస్తున్నారు ఈ రకమైన చిత్రాలు జీవితం నుంచి పలాయనం చేసేందుకే ఏర్పడ్డవనీ, వాటికి కళా విషయకంగా విలువ లేదనీ వారు అంగీకరిస్తున్నారు కాని అమెరికాలో తయారయ్యే ప్రతి చిత్రంలోనూ చవకబారు వినోదం ఉండటం లేదు. సంఖ్యలో స్వల్పమైనా కొన్ని చిత్రాలలో నిజమైన కళ ఉన్నదని ప్రసిద్ధ విమర్శకులు అంటున్నారు ఇటువంటి చిత్రాలకే అంతర్జాతీయ బహుమతులు, ఆస్కార్ బహుమతులు, ఎకాడమీ బహుమతులు మొదలైనవి లభిస్తున్నాయి ఈ తరగతి చిత్రాలకు ఉదాహరణ ఇటీవల మద్రాసు వచ్చిన "ఎ స్ట్రీట్ కార్ నేమ్డ్ డిజైర్" అనే చిత్రం

పార్కర్ బ్రదర్సు వారు తయారుచేసిన ఈ చిత్రంలో కథ మనస్తత్వ పరిశోధన శాస్త్రం (సైకో ఎనాలిసిస్) మీద ఆధారపడినది జీవితంలో అన్నీ ఎదురు దెబ్బలే తింటూ, ఒక్క తన సోదరిచేత తప్ప మిగతా ప్రపంచమంతటిచేత అసహ్యించుకొనబడుతూ చివరికి ఉన్మాదగ్రస్తురాలైన ఒక స్త్రీ ఈ చిత్రంలో కథానాయిక "గంటకు ఎనభైమైళ్ల వేగంతో పరిగెత్తే అమెరికన్ జీవన విధానం" లోని కల్లోలానికీ, అవ్యవస్థకీ, ఉన్మాదానికి ఈ చిత్రం ఒక రకంగా ప్రతిబింబమని చెప్పాలి అమెరికాలో నేడు మనస్తత్వ పరిశోధన శాస్త్రం బహుళ ప్రచారంగల వ్యాపార కళగా తయారైంది ఈశాస్త్రాన్ని ప్రచారం చేసేందుకు ప్రత్యేకంగా సినిమాలు (స్పెల్ బౌండ్) కూడా తయారవుతున్నవి కాని ఈ శాస్త్రం మనస్తత్వ సమస్యలను పరిశీలించటంలో పైపై కారణాలనే స్పృశిస్తుందిగాని అన్నిటికీ అట్టడుగున ఉండే సామాజిక కారణాలను స్పృశించదు అందుచేతనే "స్ట్రీట్ కార్.." లాంటి చిత్రాలు జీవితానికి వాస్తవిక ప్రతిబింబాలుగా కాక వికృత ప్రతిబింబాలుగా కనిపిస్తాయి వాస్తవిక కళ జీవితాన్ని యథాతథంగా ఫోటో తీసినట్టుగా చూపించదు, నిరంతరం మారే పరిస్థితుల మధ్య నిరంతరం మారే జీవితాన్ని చిత్రిస్తుంది, పత్రికలలోని వార్తా కథనంవలె కాకుండా బహుముఖమైన జీవితంలో వివిధాంశాలకు గల సంబంధాన్ని చిత్రిస్తుంది

అంత మాత్రాన అమెరికన్ చిత్రాలలో వాస్తవికత పూర్తిగా చనిపోయిందని అర్థం కాదు నీగ్రో సమస్య లాంటి సామాజిక సమస్యలను సానుభూతితో చిత్రించటానికి ప్రయత్నించిన చిత్రాలు లేకపోలేదు కాని ఇటువంటివి సంఖ్యలో అతి స్వల్పం వీటిని మినహాయిస్తే మిగతా చిత్రాలన్నీ నేర నిరూపణ చిత్రాలు (క్రైమ్)గానో, గత శతాబ్దంలో అమెరికన్ రాష్ట్రాల విస్తరణను చూపించే చిత్రాలుగానో, కేవలం స్టంటు చిత్రాలుగానో ఉండిపోతున్నాయి ఈ చిత్రాలలో హంతకులు, దొంగలు కథానాయకులు పాశవికత, క్రౌర్యం కథావస్తువులు

కాని జీవితంనుంచి దూరమైపోయిన కళ కళగా ఎక్కువకాలం నిలవలేదు వ్యాపారదృష్ట్యా కూడా ఆ కళ కొంతకాలానికి లాభసాటి కాకుండా పోతుంది ఊహాకల్పిత జగత్తుకంటే వాస్తవ జగత్తు, వాస్తవజీవితం ఎంతో విశాలమైనవి జగత్తునుండి కళను సృష్టించటానికి పూనుకోవటం వల్లనే హాలీవుడ్ చిత్రాలు ఒకదాని కొకటి అనుకరణగా తయారై, చవకబారి పోతున్నవి యుద్ధానంతరం హాలీవుడ్‌లో భావాలకొరత ఏర్పడిందని ఇటీవల భారతదేశం వచ్చిన ప్రఖ్యాత అమెరికన్ చిత్రనిర్మాత ఫ్రాంక్ కాప్రా ప్రకటించాడు హాలీవుడ్‌లోకి కొత్తభావాలు రావటం మానేశాయనీ, పాతభావాలనే తిరగదోడి చిత్రాలు నిర్మిస్తున్నారనీ, అందువల్ల కొందరు హాలీవుడ్ నిర్మాతలు అమెరికన్ కథా వస్తువులను వదిలిపెట్టి ఇతరదేశాల వంక తిరుగుతున్నారనీ ఆయన ఉద్దేశపడ్డాడు ఇందుకు ఉదాహరణగా భారత



పులి పిల్లి అయింది. గణపతి (రంగారావు)కి జేజేలువచ్చాయి. పీపుల్స్ వారి "పల్లెటూరు"లో ఒక దృశ్యం.

# ★ విషపు నవ్వు ★

శ్రీ నిమ్మగడ్డ ధనరత్నప్రసాద్

అవి దసరా శెలవులు. మా నాన్న నన్ను మా వూరు అర్జంటుగా వెళ్ళి రమ్మన్నారు. సరే వెళ్తాలే అన్నానే కాని నాకు భయంగానే ఉంది ఎందువల్లఅంటారేమో స్టేషన్‌కు మా వూరు నాలుగుమైళ్ళ దూరంలో ఉన్నది. రైలు దిగేసరికి ఏడు గంటలవుతుంది. అప్పుడు ఆ చీకట్లో పొలాల్లోనుంచి నడచి వెళ్ళాలి. పోనీ పోవలా పోతే పోయింది. రిక్షా ఎక్కి వెళ్దామంటే మా వూరికి రిక్షాలు లేవుగదా జట్కాలు కూడ లేవు. ఎలా వెళ్ళటం? నడచి వెళ్ళవలసిందేగా. పోనీ నడచి అయితే వెళ్తాను కాని రాత్రిపూట ఆ స్టేషన్‌లో ఎవ్వరూ దిగరు. పొలాలనడుమ ఆ చిన్న రోడ్డుమీదనుంచి వెళ్తూ ఉంటే సామాన్యంగా పగలే భయం వేస్తూ ఉంటుంది. చివరికి భయాన్ని చీల్చుకొని రైలు ఎక్కా.

నేను రైలెక్కినతరువాత రెండు స్టేషన్లు వెళ్ళినవి. మా వూరు వెళ్ళాలంటే కనీసం పదిహేను స్టేషన్లు అయినా దాటాలి. అందుకని నేను వస్తువులు పెట్టేచోటు కెక్కి పడుకున్నా. నేను తిరిగి తెల్లవారే రావాలి కనుక ఏం బట్టలు తీసుకొని వెళ్లలా. అసలే దసరాశెలవుల్లో నాకు బద్ధకం ఎక్కువ. అందువల్ల ఎప్పుడు నిద్ర పట్టిందో నాకు తెలియదు.

నేను నిద్ర లేచేసరికి "చక్కరకేళి... వడా..... బటానీ" అనే కేకలు వినపడుతూ ఉన్నవి. కండ్లు తెరచి అలాగే పండుకొన్నా. నాకు ఎదురుగా దూంచి బలిష్టమైన మనుష్యులు ఇద్దరు కూర్చొని మాట్లాడుకుంటున్నారు. మిగతా అందరూ నిశ్శబ్దంగా ఉండుటవల్ల వాళ్ళిద్దరిమాటలు స్పష్టంగా వినపడసాగాయి. ఒక అతను

"ఇది ఏ స్టేషనురా?" అని అడిగాడు.

"నూజెళ్ళ" అన్నాడు రెండవవాడు. అంటే నేను ఇంకా రెండు స్టేషన్లు దాటాలి.

"అయితే నీకు టిక్కట్టు ఉందిరా" అన్నాడు మొదటివాడు.

"నీకు ఉందా లేదా?" అని అడిగాడు రెండవవాడు.

"లేదు" అనుకున్నారు ఇద్దరూ.

ఇద్దరకూ టిక్కట్లు లేనందుకు ఇదగూ ధైర్యం తెచ్చుకుని కూర్చున్నారు. ఇంతలో ఊడిపడాడు టిక్కట్టు కలక్టరు. అందరినీ టిక్కట్టు అడగగా అందరూ చూపించారు విసుగు ప్రారంభమైనది కలక్టరుగారి ముఖంలో. ఎందుకో ఆ విసుగు నాకు అర్థం కాలా. కలక్టరు ఆ బలిష్టమైన మనుష్యుల్ని టిక్కట్లు అడిగాడు. వాళ్ళిద్దరూ ఏకగ్రీవంగా, నిర్భయంగా "లేవు" అన్నారు. "అయితే దిగండి" అన్నాడు కలక్టరు. "దిగటం ఎందుకూ?" అనిఇద్దరూ చెరొక బేడ కాసులను ఇచ్చారు. కలక్టరు గారి ముఖం వికసించింది ఇప్పుడర్థమైంది ఇందాక కలక్టరుగారు ఎందుకు విసుక్కున్నారో. నా దగ్గరకు వచ్చి టిక్కట్టు అడిగాడు. నేను నా సగం టిక్కట్టు చూపించా.

"నీకు ఎన్ని సంవత్సరాలు" అన్నాడు కలక్టరు.

నేను సామానులు పెట్టేచోటే ఉండి నాకు పధ్నాలుగు సంవత్సరాలయినా

"పన్నెండు" అన్నా

"అయితే నిండు టిక్కట్టు కొనాలి అవి

---

దేశంలో నిర్మింపబడిన "ది రివర్" ను ఆయన పేర్కొన్నాడు.

కాని కథావస్తువులకోసం, భావాలకోసం అమెరికనులు ఇతరదేశాలవంక దృష్టి సారించవలసిన అవసర మేముంది? జీవితాన్ని వాస్తవికంగా, సానుభూతితో చూడగలిగినవారికి భావాలకొరత ఎందుకు ఏర్పడుతుంది? విశాలమైన జీవితంలో ప్రతి అల్పసంఘటనకు ఒక ప్రత్యేకత, వ్యక్తిత్వమూ ఉంటుంది వాస్తవ జీవితాన్ని చూడటానికి భయపడేవారికి మాత్రమే కథావస్తువులు కరవౌతయి. అమెరికాలో కూడా నేడు ఇటువంటి పరిస్థితే ఏర్పడింది. సంఘవిద్రోహులు ఏ రంగంలో ఉన్నా ఏరిపారవెయ్యాలనే ఉద్దేశ్యంతో అమెరికన్ ప్రభుత్వం ముఖ్యంగా కళారంగాన్ని ముట్టడించింది.

"అమెరికన్ వ్యతిరేక చర్యలసంఘం" అనే ఒక సంఘంద్వారా హాలీవుడ్‌లోగల ప్రతిభావంతులైన రచయితలను, డైరెక్టర్లను, నటీనటులను సినిమారంగంనుండితొలగింపజేసింది. ఏమాత్రం కొత్తభావాలు, అభ్యుదయ దృక్పథం కలవారికైనా హాలీవుడ్‌లో స్థానంలేకుండా పోతున్నది. ఇందువల్ల సినిమా కళ పరస్పరానుకరణగా తయారౌతున్నది.

ఈ మాదిరి ప్రమాదం భారతీయచిత్రాలకు రాకుండా చేసుకునే బాధ్యత మన చిత్ర నిర్మాతలపై ఉంది. మన చిత్రాలలో కూడా నూటికి తొంభైచిత్రాలు ఆర్థిక విజయం పొందిన కొన్ని చిత్రాలకు అనుకరణగా మాత్రమేతయారౌతున్నాయి. కొత్తదారి తొక్కిన ఒక చిత్రం ఆర్థిక విజయం పొందినదనగానే ఆ చిత్రానికి పది అనుకరణ చిత్రాలు బయల్దేరి దెబ్బతింటున్నాయి. ఏమంచి చిత్రంనుంచి అయినా, లేక ఏ విదేశీయ చిత్రంనుంచి అయినా మనం నేర్చుకోవలసిన కొత్త విషయాలెప్పుడూ ఉంటాయి. అంత మాత్రాన వాటిని కేవలం అనుకరించాలనుకోరాదు. మన నిర్మాతలకు కేవలం అమెరికన్‌చిత్రాలే ప్రమాణం కావటానికి ఒక ముఖ్యకారణం మనకు తదితర దేశాల చిత్రాలతో పరిచయం లేకపోవటమే.

ఈ సంవత్సరారంభంలో మనదేశంలో జరిగిన అంతర్జాతీయ ఫిల్మ్ ప్రదర్శనంలో మనకు అనేక విదేశీయ చిత్రాలు చూసే అవకాశం కలిగింది ముఖ్యంగా ఇటాలియన్, జపానీస్, ఫ్రెంచ్ చిత్రాలు భారతీయులను ఎక్కువగా ఆకర్షించాయి. మన దేశానికి ప్రత్యక్షంగా యుద్ధం తాకిడి తగలకపోయినా యుద్ధానంతర పరిస్థితులు మన దేశంలోను ఇటలీ, జపాన్, ఫ్రాన్సు దేశాల్లోను రమారమి ఒకే రకంగా ఉన్నాయి. ఆ పరిస్థితులనే ఆ దేశాల చిత్రాలు ప్రతిబింబించటానికి ప్రయత్నిస్తున్నాయి. కనుక ఆ ప్రయత్నం నుండి మనం నేర్చుకోవలసిన విషయాలు చాలా ఉంటాయనటంలో సందేహంలేదు. ★



...పనవారి "మనరికం"లో రిక్షావాలాతో మాట్లాడుతున్న నారాయణరావు.

విషయం నీకు తెలియదు కాబోసు మిగతా అర్ధరూపాయి ఇయ్యి" అన్నాడు.

ఆ పెట్టెలో వాళ్ళంతా నావంకే చూస్తున్నారు ఆ అవమానం భరించలేక సగం టిక్కెట్టు ధరా ఇచ్చివేశా కలక్టరు ఆ అర్ధరూపాయి తీసుకుపోతున్నాడు అప్పుడు నేను "రసీదండీ" అన్నా

"ఓ! మరచిపోయాను" అని ఒక రసీదు వ్రాసి ఇచ్చి ఒక చిన్న విషపు నవ్వు నవ్వి పోయాడు

ఇప్పుడు నాకు నిండు టిక్కెట్టు ఎలాగూ కొనవలసి వచ్చింది పోనీలే పోతే పోయింది వెధవ సెబ్బు కాని ఆ విషపు నవ్వు సంగతి నాకు అర్థం కాలా స్కూల్ ఫైనల్ విద్యార్థికి ఆ మాత్రం అర్థం కాకుండా పోతుందా అని అనుకొని ఆ నవ్వు ఎందుకు నవ్వింది ఆలోచించసాగాను కాని అర్థం కాలా ఇంతలో నేను దిగవలసిన స్టేషన్ వచ్చింది నేను దిగిపోయా నాతో పాటు ఆ ఇద్దరు బలిష్ఠమైన మనుష్యులు కూడా దిగారు

*   *   *

చంద్రుడు ప్రకాశించుతున్నాడు అంటే సూర్యుడు అస్తమించి గంట అయిందన్న మాటే కరంటు లైటులుగానీ కిరసనాయిలు దీపాలుగాని లేని ఆ చిన్న రోడ్డు మీద అప్పనంగా వచ్చిన చంద్రకాంతిని ఆధారం చేసుకుంటూ వాళ్ళిద్దరితో నడుస్తున్నాను రోడ్డు కిరుప్రక్కల పొలాలు కాలువలు ఆ కాలువల ప్రక్కన తాటి చెట్లమీదనుంచి కొంగల శబ్దం, పిల్ల కాలువలలోనుంచి చాపలగంతులు దెయ్యాలు, పాములు అన్నట్టు అనుమానం కలిస్తున్నాయి ఆ పెద్ద మనుష్యులిద్దరూ దెయ్యాలేమోనని నాకు అనుమానం కలిగింది వాళ్ళ ఇద్దరి కాళ్ళ దగ్గరకు వెళ్ళి బాగా పరిశీలించా కాని వాళ్ళు మామూలు మనుష్యులే 'దెయ్యాలకు కాళ్ళు తిరగేసి ఉంటాయి' అని నా నమ్మకం వీళ్ళ కాళ్ళు మామూలుగా ఉన్నవి

వాళ్ళు ఇద్దరూ తురకం మాట్లాడుతున్నారు అందులో ఒకడు జోరుగా మాట్లాడుతున్నాడు మరి యొకడు నెమ్మదిగా మాట్లాడుతున్నాడు నేను నెమ్మది నెమ్మదిగా మాట్లాడే అతన్ని హిందువు అనుకున్నా వాళ్ళు మాట్లాడుకునే మాటల్లో ఒక్క మాట మట్టుకు తెలిసింది అదయినా ఎలా అర్థం చేసుకున్నానంటే నెలకు అయిదు రూపాయిలు ఇచ్చి హిందీ నేర్చుకుంటున్నాను కాబట్టి రేపు సాయిబుల పీర్ల పండగట

మా ఊరికీ స్టేషన్‌కీ మధ్య తురకపాలెం ఉంది ఆ తురకం జోరుగా మాట్లాడిన

పోయాబు తురకపాలెం రాగానే వెళ్ళిపోయాడు. ఆ పాలెందగ్గరనుంచి మా వూరు అరమైలు దూరాన ఉన్నది. నేను ఆ నట్లు నట్లుగా మాట్లాడిన హిందువుతో ఆ అరమైలు దాటుటకు ప్రయత్నిస్తున్నాం. అప్పుడు అతడు నన్ను సమీపించి

"ఏ వూరు" అన్నాడు

"విజయవాడ" అంటిని

"అయితే అక్కడ ఏమి సినిమాలు ఉన్నవని?" ప్రశ్నించాడు

ఈ ప్రశ్నకు నాకు నవ్వు వచ్చింది "సనం, పరిస్తాన్, *LAST GENGIL*, ఒకరాత్రి"

"తెలుగు కేమి లేవన్న మాట" అని అడిగాడు

"పాతాళభైరవి ఉంది" అన్నా.

"చూసిందేలే" అని పణుక్కున్నాడు

ఆ చీకట్లో మా వూరి దీపాలు మిణుక్ మిణుక్‌మంటూ కనపడుతున్నవి మా ఇద్దరిలోను కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడచాయి

"బెజవాడకి ఇక్కడికి టిక్కెట్టెంత" అని అడిగాడు

"నిండా? సగమా?"

"నిండు"

"రూపాయి"

"నువ్వు సగంటిక్కెట్టు కొన్నావనుకుంటానే?"

"అవును"

"ఆ కలక్టరుకి ఎంత ఇచ్చావు" అని అడిగాడు

"అర్థరూపాయి" అన్నా.

"అర్థరూపాయి ఎందుకూ పావలా ఇస్తే వాడి త్రోవన వాడే పోయే వాడుగా" అన్నాడు

ఆ కలక్టర నవ్విన నవ్వునవ్వు నాకిప్పుడు అర్థమైనది కాని నాకు ఒకటి తోచింది 'బస్తీల్లోకంటే పల్లెల్లోనే ఎక్కువ లంచాలు జరుగుతున్నవని' అర్థరూపాయి ఎందుకు పావలా ఇస్తే పోయేదిగా అని కామోసు ఆ నవ్వు నవ్వు అర్థం. ★



రాగిణీవారి "ధర్మదేవత' లో నూత్న ప్రేమికులు గిరిజ, కౌశిక్.

# దెయ్యం

(12-వ పేజీ తరువాయి)

సుబ్బారెడ్డి సంతోషించాడు. కాని ఊ, ఆ, అని నశిగాడు.

"నీ ఉద్దేశం ఏమిటో సరిగా చెప్పు" అని నారాయణ తెగేసి అడిగాడు.

"ఆ! ఏమీ లేదు చింతలపూడిదగ్గర ఏదో పల్లెటూరంట మొన్న వాళ్ళొచ్చారు. పిల్ల ఎర్రగా చక్కగా వుంటుంది వాళ్లు రు 250 కట్నం ఇస్తామన్నారు. వాళ్ళకేగాటా చెప్పనేలేదు. మరి నీమాటేమిటి చెప్పు" అన్నాడు ముసలాడు ఆశగా.

ఆమాట వినేటప్పటికి నారాయణకు కాళ్ల క్రిందభూమి కదలిపోయినట్లయింది నారాయణ ముఖం కందగడ్డలా తయారయింది. కళ్ళు చింతనిప్పుల్లా మెరుస్తున్నాయి.




తనెక్కడవున్నాడో తనకే తెలియదు. వళ్లు తెలియని ఆవేశంతో సుబ్బారెడ్డి కంఠం రెండుచేతులతో పట్టుకొని "దౌర్భాగ్యుడా! నీకూ కట్నం కావాలీ! కూలివాడికి, ఏరోజు కూలితెస్తే ఆరోజు తిండికి వుండేవాడికి కట్నం కావాలేం?" అని కంఠం గట్టిగా నొక్కేశాడు. ముసలాడి గోలకు ఇరుగుపొరుగువారంతా పరుగెత్తుకొచ్చారు నలుగు రయిదుగురువచ్చి నారాయణని పట్టుకొనేదాకా నారాయణకి తానేమిచేసింది తెలియనేలేదు. ముసలాడికి కాసిన్ని చన్నీళ్లు పట్టేరు కాని అప్పటికే అతని ప్రాణాలు గాలిలో కలిసి చాలసేపయింది.

ఆమరునాడు పత్రికలో పడింది "నారాయణ అనే వ్యక్తి తన కూతురుని చేసుకోమని అడిగితే కట్నం ఇమ్మన్నాడని, సుబ్బారెడ్డి అనే అతన్ని కంఠం పిసికిచంపాడు" అని.

మరి నాలుగు నెలల తరువాత, తిరిగి పత్రికలో ఇలా వ్రాసేరు. "కట్నం ఇమ్మన్నందుకుగాను గొంతుక పిసికి చంపిన నేరానికి నారాయణ అనే వ్యక్తికి ఉరి శిక్ష విధించబడింది"

ఆ తరువాత నారాయణ దెయ్యం అయినాడని, వెంకటరెడ్డి కుటుంబాన్ని హింసిస్తున్నాడని, కట్నాలడిగే వాళ్ళందరికీ కనపడి భయపెట్తున్నాడని ఆ వూరి ప్రజలంతా అనుకుంటారు. ★

# పుట్టిన రోజు

(18-వ పేజీ తరువాయి)

యిష్టానికి లోబడి సంచరించండి రేపటి నుంచీ మీ అధికారం మీరు యథాప్రకారం చెలాయించొచ్చు ఈ వాళ నాకు పుట్టిన బుద్ధికి క్షమించండి.'

చివరివాక్యం వుచ్చరించేప్పుడు కన్నీరు కార్చటం ఆమెకు తప్పనిసరయింది. ఆ వాక్యం ఆమె పూర్వపు బానిసత్వాన్ని ఆమెకు అంటగట్టింది. ఆమె కళ్ళుకూడా క్షమార్పణ వేడుకొంటున్నాయి

సీతమ్మ మాటలు స్వార్థపరుడైన సుబ్బయ్య మనస్సుమీద ఏమాత్రంకూడా పని చెయ్యలేదనే చెప్పాలి. ఆమె క్షమార్పణ వేడటం వల్ల పోయిన ధైర్యంమాత్రం తిరిగొచ్చింది. మళ్లీ ఆమెను యథాప్రకారం కీలుబొమ్మగా చెయ్యవచ్చునన్న సంగతి తట్టగానే విషంతో కూడిన చిన్నవవ్వు నవ్వాడు.

సీతమ్మ వంటింట్లోకి వెళ్లి పళ్లెంనిండా రకరకాల పదార్థాలుపెట్టి తీసుకువచ్చి వడ్డించింది. వాటిల్లో చెప్పతగినవి యివి: బంగాళాదుంప కూర, గోంగూర పచ్చడి, పెసరట్లూ, మైసూరుపాక్ ఇవంటే సుబ్బయ్యకు చచ్చేటంత యిష్టం. అనుకోకుండా యివన్నీ వొచ్చిపడేటప్పటికి అంతా అయోమయం అయిపోయింది సుబ్బయ్యకి. ఏదో మాట్లాడాలనుకున్నాడు. కాని ఏమి మాట్లాడాలో తోచక సీతమ్మవైపు కళ్లప్పగించి చూస్తున్నాడు.

సీతమ్మ మళ్లీ వంటింట్లోకి వెళ్లింది. ఈసారి ఏం తీసుకువస్తుందా అని సుబ్బయ్య ఎదురుచూస్తున్నాడు. గిన్నెతో పులుసు తీసుకువచ్చి కంచం పక్కన పెట్టింది.

"ఏమిటిది?" ఏదోఒకటి మాట్లాడాలని అడిగాడు.

"ఉల్లిపాయల పప్పుపులుసు."

"అయితే నిన్ను క్షమించక తప్పదన్న మాట." ★

# జారుడుదారి

(2)-వ పేజీ తరువాయి)

న్నారు శ్రీపతికి లక్షలున్నయ్ కాబట్టి కార్లలో తిరుగుతూ, పంకాల క్రింద మసలుకుంటుంటాడు. తెలివితేటలు, పెద్ద పెద్ద చదువులు డబ్బు ముందు దిగదుడుపే ననుకున్నాడు దాంతో ఏదో ఉద్రేకం వచ్చింది. కూలీలకు నాయకత్వం వహించాడు.

సత్యం కూలీల తరఫున పనిచేయడానికి వారిపై గల సానుభూతి ఒకటే కాదు. ధనవంతులపై గల ద్వేషం, ఈర్ష్య అతన్ని అలా చేసినయ్. ముఖ్యంగా శ్రీపతి మీది అసూయ. సత్యం నాయకుడు కాగానే అతనికి నూతన జవసత్వాలు కలిగినయ్. ఎంతో గట్టిగా పని చేశాడు. కూలీలంతా ఏక కంఠంతో సత్యం అన్న మాటలనే అరిచారు. అధికారులు వారికింక మంచి మాటలు చెప్పలేక పోయారు. రేపు మాపు, అనడానికి వీలుపడలేదు. రెండు నెలలు జీతం బోనసు క్రింద ఇవ్వడానికి ఒప్పుకున్నారు.

ఈ పని చేశాడనే సత్యాన్ని కమ్యూనిస్టు అంటున్నారు కూలీల కష్టానికి తగ్గ ప్రతిఫలం ఇవ్వమనడం అతనికి తప్పులా కానీ, కమ్యూనిస్టు సిద్ధాంతంగా కాని తోచలేదు. ఏమంటే అసలు అతనికి కమ్యూనిస్టు సిద్ధాంతాలుగాని, కాంగ్రెసు సిద్ధాంతాలు గాని తెలియవు. కాలేజీలో చదివేటప్పుడు కూడ అతను కాంగ్రెసు పార్టీలోనే చేరాడు. ఇప్పుడు అతనిలో పుట్టిన విపరీత భావాలకు అతన్ని కమ్యూనిస్టు అంటున్నారు. ఇప్పుడు అతనుచేసే పని కమ్యూనిస్టు సిద్ధాంతమయితే బాహాటంగానే చెప్పాలనుకున్నాడు ఆ విషయం, అంటే తను "కమ్యూనిస్టును" అని.

తను చేసే ఈ పని అన్యాయమైందయితే దానిలో తనెందుకు జయిస్తాడు? అధికారులే దీనికి ఒప్పుకున్నారు. కాబట్టి తన నడవడిలో న్యాయముందన్న మాట ఈ న్యాయమే కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతమయితే ఒప్పుకోక ఏం చేస్తాడు?

"అమ్మా!" అన్న మూలుగు వినబడింది. గబగబా పరుగెత్తుకుని అమ్మ దగ్గరకు వెళ్లాడు సత్యం. ఆత్రుతగా "ఏం అమ్మా?" అన్నాడు. "పక్క... లో పో... టు... అ... బ్బా" అంటూ మంచంమీద ఇటూ అటూ దొర్లుతోంది అమ్మ. అమ్మ నాలుగు నెలలనుండీ నీరసంగా ఉంది. టానిక్కులు వాడమన్నారు. ఆమెకు ఇంటి పరిస్థితులను చూచినమీదట మానసికంగా ఏర్పడిన జబ్బు అది. గుండె జబ్బుకూడ ఉంది అన్నారు. ఈ సంపాదనతో ఖరీదయిన మందులు కొనలేక పోయేవాడు. తను స్కాలర్‌షిప్‌లతో ఆపుచేసి వట్లయితే ఆ మాత్రమైనా ఉండడమే కాక, ఇప్పటికంటే జీతం ఎక్కువే సంపాదించే వాడిని అనుకున్నాడు. అప్పుడు అమ్మ ఇంతగా బాధపడేదికాదు.

గబగబా డాక్టరు దగ్గరకు పరుగెత్తాడు. "పన్నెండు గంటలకు ఇప్పుడేమిటి?" అన్నాడు డాక్టరు. అవును నిజమే. తనొక్కడే పన్నెండు గంటలవరకూ నిద్రపోడు. అందరకూ సగం నిద్ర అయిపోతుందప్పటికి. అవాళే అందిన జీతం చూపించాడు. డాక్టరు వచ్చి ఇంజక్షనిచ్చి" ఉదయం వస్తా" నని ఇరవైరూపాయలు తీసుకుని వెళ్లాడు.

తర్వాత రెండురోజుల వరకూ అమ్మ లేవలేదు. అయినా సత్యం కంపెనీకి పోవలసి వచ్చింది. ఎన్ని విధాల ప్రయత్నించినా సెలవు దొరకలేదు. మూడోరోజుకు అమ్మ కొంత తేరుకుంది. సత్యం సంతోషించాడు. ఎప్పటికైనా తను బాగా డబ్బు సంపాదించి, తన గొప్పతనం ఆమెకు చూపి సంతోష పరచాలని అతని ఉద్దేశం. కాని ఆమెకున్న ఒక్క కోర్కె సత్యం వివాహం చేసుకోడం. దానికి సత్యం సమ్మతించలేదు.

అవాళ సత్యం కంపెనీకి రావడంతోనే కొంతమంది గుమస్తాలు అతనివంక అదోలా చూచారు. సత్యానికి ఆ వాతావరణంలో కొంచెం మార్పు కనిపించిందే కాని, దానికి కారణం తెలియలేదు. కొంత సేపటికి శ్రీపతి దగ్గర్నుండి కబురొచ్చింది. శ్రీపతి మద్రాసు నుండి ఎప్పుడొచ్చాడో కూడ తెలియదు అతనికి. శ్రీపతి గదిలోకి వెళ్ళాడు. "నీవు కూలీల తరఫున పనిచేస్తున్నావట. నిన్ను తప్పించేస్తానంటే నేను చెబుతానని వచ్చాను వాళ్ళ గొడవ నీకెందుకు? ఆ గొడవల్లో నుండి తప్పుకొంటే నీకు జీతం ఎక్కువిచ్చే ఏర్పాటుకూడా చేస్తాను. మళ్ళీ నెలనుండే తీసుకుందువు గాని" అన్నాడు శ్రీపతి.

వెయ్యిమంది కూలీలు ఆర్తనాదాలు చేస్తూ సత్యంమనోదృక్కులకు కన్పడ్డారు. శ్రీపతి చెప్పిన దానిని తిరస్కరించి బయటికి వచ్చాడు. తర్వాత గంటలోనే ప్యూన్ సత్యానికి కాగితం ఇచ్చాడు. విప్పి చూచాడు. తనని డిస్మిస్ చేశారు. వణికే చేతుల్తో కాగితాన్ని చింపి బయట పడ్డాడు. ఈ సంగతి తెలిసి కూలీలంతా అరుస్తున్నారు. కొందరు సత్యంతో బయటికి వచ్చారు. సత్యం వాళ్ళకు నచ్చజెప్పి లోపలకుపంపిస్తున్నాడు. ఇంతలో కుర్రాడొకడు సత్యానికి కబురందించాడు. "పక్కలో పోటొచ్చి మీ అమ్మ చచ్చిపోయింది" అని. సత్యం పరుగెత్తుకునివెళ్ళి భోరుమంటూ తల్లిమీదపడ్డాడు. అసమర్థుని జీవితరథానికి గుర్రాలు పూన్చబడ్డాయి. ఎక్కడో ఓ మెరుపు మెరిసింది. ★

# హకల్ బెరీ ఫిన్

(30-వ పేజీ తరువాయి)

గత్తుకు రావటం కనిపించింది. వాళ్లు కొంతసేపు ఆ ప్రాంతంలో ఈ ఇద్దరు కొత్తవాళ్ల కోసం వెదికి, కనబడక, వెనక్కి వెళ్ళిపోయారు.

మేము లంకలో దిగి ఆపగలంతా అక్కడే గడిపాము. నా వెంట వచ్చిన ఇద్దరు కొత్త వాళ్ళలో ఒకడు డెబ్భయ్యేళ్ల వృద్ధుడు. ఇంకోడు ముప్ఫయ్యేళ్ళ యువకుడు. వృద్ధుడి తలమీద మచ్చుకైనా వెంట్రుకలు లేవు; నిగనిగ మెరిసే బట్టతల. మీసాలు మాత్రం వున్నాయి బూడిద పూసినట్టు. నలిగి తుక్కైపోయిన టోపీ, తగలబెట్టినా తగల బడనంత మాసిపోయిన చొక్కా, పంట్లాం, తూట్లుపడిన బూట్లు, రెండువందల ఏళ్ళకిందటి పాతకోటు—ధరించాడు. కోటు రెండు పక్కల రెండు జేబులు బస్తాలంత పెద్దవి, ఉన్నాయి. యువకుడు ఇంత అసహ్యంగా భరించటానికి వీలైన బట్టలు ధరించాడు. వాళ్ల మాటల్లో బయట పడిన వింత విషయమేమిటంటే ఈ ఇద్దరు మనుషులు ఒకళ్ల నొకళ్లు ఎరగరట.

"నువ్వెందుకు పారిపోయి వచ్చావు" అని బట్టతల మనిషి యువకుణ్ణి అడిగాడు.

"నేను కొంతకాలం నుండి ఒక రకమైన మందు అమ్ముతున్నాను. ఆ మందు పళ్లనెప్పులు పోగొడుతుంది. కాని దాన్ని వాడిన వాళ్లందరికీ పళ్లనెప్పులే కాకుండా పళ్లుకూడా పోవటం మొదలెట్టాయి. అసలదీ కాక, నేను ఆ వూళ్లో ఉండవలసిన దానికంటే ఒకరోజు ఎక్కువ వున్నాను. ఇంక ఎల్లాగూ జనం నన్ను చిత్రవధ చేస్తారని భయపడి నేను తెల్లవారుఝామునే లేచి నదిఒడ్డున నడక సాగించాను. ఇంతలో నువ్వుకూడా అదే దారి నివస్తూ 'వాళ్లొస్తున్నారు, పారిపో పారిపో,' అని కేక లేశావు. దాంతో నేను కూడా నీవెంట పరిగెత్తటం మొదలెట్టాను. అదీ నా కథ. ఇక నీకథ చెప్పు."

బట్టతల మనిషి తనకథ చెప్పసాగాడు!

"నేను కూడా నువ్వు ఉన్న ఊళ్లోనే వారం రోజుల్నించీ ఉంటూ తాగుడుమీద ఉపదేశాలు, ఉపన్యాసాలు ఇస్తున్నాను. రోజూ నా ఉపన్యాసాలు వినటానికి చాలామంది వచ్చేవారు. రోజుకి నాలుగైదు డాలర్లు సంపాదించే వాణ్ణి. వ్యాపారం బాగానే సాగుతోంది కదా అని తృప్తిపడ్డాను. చివరికి కిందటి రాత్రి అకస్మాత్తుగా ఎవరో నాగదిలో ఒక విస్కీ కూజా ఉందని కనిపెట్టారు. దాంతో ఊళ్లో వాళ్లకి నామీద కోపంవచ్చి ఇవ్వాళ నన్ను పట్టుకు తన్నాలని ప్లాను వేశారట. ఈసంగతి నాకో స్నేహితుడు చెప్పాడు. కుక్కల్ని వెంట బెట్టుకువచ్చి వాటిని నామీదికి వదిలి పెడతారని చెప్పాడు. దాంతో ఉన్న పళంగా మూటా ముల్లె ఎత్తుకుని పారిపోయి వచ్చేశాను. సరే గాని నువ్వేం చేస్తూ వుంటావు మామూలుగా?"

"కొన్నాళ్లు అచ్చు ఆఫీసులో పనిచేశాను. మందుల షాపులో పనిచేశాను. నాటకాల్లో వేషాలు వేశాను: గారడీకూడా ప్రాక్టీసు చేశాను. ఎప్పుడైనా ఉపన్యాసాలు ఇవ్వటంకూడా నేర్చుకున్నాను. ఏదైనా చెయ్యగలను, తల్చుకుంటే. నువ్వేం చెయ్యగలవు ?" అని అడిగాడు యువకుడు.

"నేను వైద్యం చేశాను కొన్నాళ్లు. పక్షవాతం, రాచ కురుపులు బాగా నయం చెయ్యగలను. ఎవరన్నా రహస్యంగా వివరాలన్నీ చెబితే జ్యోతిషం కూడా చెప్పగలను. చర్చిలలో మతంమీద ఉపన్యాసా లివ్వగలను."

"అయితే మనిద్దరం ఇకనుంచి కలిసి పని చేద్దామా ?"

"ఓ. అల్లాగే."

(ఇంకావుంది)



Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras

Regd No M 4479

త్వరలో వచ్చుచున్నది!




అనువాదం

నండూరి రామమోహనరావు

వెల రూ. 1-8-0

పోస్టు ఖర్చులు ప్రత్యేకం

## ఆంధ్ర గ్రంథమాల,

మద్రాసు 1.